సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Reg. No. M. 3766

సంపుటము 31 సంచిక 4

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

జూలై 1942

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore

# విషయసూచిక


1. నిత్యసంకీర్తనము
2. భగవన్నుతి
3. బాలనాటికలు
4. దేశభక్తుడు
5. బాలనీతి
6. ఆరోగ్యమార్గములు
7. ఆంగ్లవిద్యార్థి
8. సివిక్సు - ప్రశ్నోత్తరములు
9. హిందూదేశచరిత్ర - ప్రశ్నోత్తరములు
10. ఉపాధ్యాయ సాంఘిక సమస్య
11. సృష్టిపరిశీలన - ప్రశ్నోత్తరములు
12. విమాన మార్గములు
13. పల్లెటూరి చదువు
14. ఆంధ్రవాఙ్మయము
15. నేనెవరో గ్రహించండి
16. ౧ ప్రకటన - (ఉచిత విద్య)
17. ౨ ప్రకటన




# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 31 | ఏలూరు 15 జూలై 1942 | సంచిక 4 |
|---|---|---|


# నిత్యసంకీర్తనము

వివరణము .

దృష్టి రెండు తెఱఁగులు - బాహ్యదృష్టి ఆంతరంగికదృష్టి. బాహ్యదృష్టితో మనము ప్రాపంచిక వస్తువులఁ జూడఁగలము. కాని ఆవిశ్వమూర్తిని గాంచలేము. ఆ మహాపురుషునిఁ దిలకించుటకు అంతర్దృష్టి యుండవలెను. మనము సాధారణముగా బాహ్యనేత్రముల మూసికొన్నపుడే సూక్ష్మవస్తువులఁ జూడఁగలుగుచున్నాము. ఇట్లు చెప్పుట మనము గ్రుడ్డివారము కావలెనని కాదు. బాహ్యేంద్రియములు చపలత్వము గలవి. అవి మన యాంతరంగికదృష్టి కడ్డుపడుచుండును. భక్తుఁడు తనకు భగవత్సాక్షాత్కారము గలిగినప్పుడు తన యింద్రియము లన్నింటిని బాహ్యవృత్తులనుండి మరల్చును. అట్లు మరల్పకున్నచో నంతరంగవిషయములు గోచరములు కావు.

సంకీర్తనము !

1. హే సర్వదర్శీ! నీ సందర్శనమే మాకు జీవితము నొసంగునదై యుండును గాక !
2. ఈ గంభీరజ్ఞానమును నా కొసంగుము.
3. సత్యమెల్లప్పుడును ప్రకాశవంతముగ నుండును. కాని నినుగొని మేము పెడమార్గములఁ ద్రొక్కుచుండువారల మాపై నీ కృపాలేశము బఱపుము.
4. హే విశ్వమూర్తీ! నా దృష్టి నీయందే లగ్నమగునట్లు చేయుము.

—స్వామిరామతీర్థ

# భగవన్నుతి

రచయిత: చిలకా వేంకటకృష్ణదాసు

శ్రీ రమణీమణీ విమల ♦ హృజ్జలజాతదినేశ ! ఘోరసం
సారభయాపహా ! దివిజ ♦ సన్నుతపాదపయోరుహద్వయా !
మేఘసమానధీర ! రిపు ♦ భీకర ! భక్తశుభంకరా ! భవ
త్సారగుణాళికీర్తనము ♦ సల్పుదు భక్తిని శ్రీరమాధవా !
శ్రీదయితా ! యనర్ఘతులసీదళ రమ్యము సర్వకాలికా
మోదసమేత రమ్యేతర ♦ పుష్పచయాంచితమై యొసంగుచున్
పాదములంటు మాల్యము న ♦ పారముదంబునఁ దాల్చు నీవు దా
మోదరమూర్తినిం గొలుతు ♦ నుజ్వలభక్తిని శ్రీరమాధవా !

---

# బాలనాటికలు

## ౧. న్యాయవాది సలహా

జి. కె. చౌదరి

(నాలుగురంగాల నాటిక)

పాత్రలు:

రంగయ్య : షావుకారు.
సుబ్బయ్య : బాకీదారు
వెంకట్రామయ్య . ప్లీడరు
జడ్జీ :
బంట్రోతు:

### మొదటి రంగము

(షావుకారు రంగయ్యా, బాకీదారు సుబ్బయ్య బజారులో యెదురుపడతారు. సుబ్బయ్య నుద్దేశించి రంగయ్య మాట్లాడుచున్నాడు)

రం:—ఏం సుబ్బయ్యా ! పైకము యిచ్చావు కావు ?

సు:—ఇస్తాలే !

రం:—ఇస్తాను, ఇస్తాను అంటూ చాలాకాలమునుండీ జరుపుతున్నావు ? ఎప్పుడిస్తావో గట్టిగా చెప్పు ?

సు:—ఫలానప్పుడని యెట్లా చెప్పగలను ? పైకము యెప్పుడు అందితే అప్పుడు.

రం:—పైకము యెప్పటికి కందుతుందో ?

సు:—ఏమో ! యెప్పటికందుతుందో ?

రం:—నువ్వు యేదో కపటముగా వున్నట్టుగా తోస్తూవుంది. కనక నా బాకీ రాబట్టు కోడానికి కోర్టులో దావా వేస్తాను. తరువాత నీ యిష్టం.

సు:—(తీవ్రముగా) నీకు చేతనైన పనిచేసుకో. దావా యేసే బాకీ రాబట్టుకో. అప్పుడే యిస్తాన్లే.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## రెండో రంగము

(వకీలు వెంకట్రామయ్యగారి యిల్లు - సుబ్బయ్య ప్రవేశము)

సు:—నమస్కారమండీ ప్లీడరుగారూ !

ప్లీడరు:—శధాస్తు ! బొత్తుగా రావడం మానేశావు సుబ్బయ్యా ! కూర్చో. విశేషా లేమన్నావున్నాయా ?

సు:—విశేషాలు లేకపోతే యిక్కడికి రావడమెందుకు ?

ప్లీ:—సరే చెప్పు.

సు:—నేను షావుకారు రంగయ్యకు పైకము యియ్యాలి - పైకము యియ్యాలిసుంటే మాత్రం మర్యాదలేకండా మాట్లాడడమేనాండి ?

ప్లీడరు:—ఏమన్నాడేంటి ?

సు:—యేమనడమేంటి ? మనిషిని కనబడనీయడు. యెక్కడపడితే అక్కడ అడుగు తుంటాడు.

ప్లీ:—అడిగితే నువ్వేమన్నావు ?

సు:—మొన్న పదిమందిలో కూర్చొని వుండగా అడిగితే - పైకము యియ్యను. నీకు చేతనైన పని చేసుకో అన్నా - కోర్టులో దావా యేస్తానన్నాడు.

ప్లీ:—సరే ! ఐతే యిప్పుడాలోచించాల్సిందేమిటి ?

సు:—యేముంది ? - ఆ బాకీ రద్దయ్యే మార్గం.

ప్లీ:—(కొంచెము సేపు ఆలోచన నటించి) ఆబాకీ రద్దయ్యే మార్గం చెప్పుతాను. మరి నాకు ఫీజేమిటి ?

సు:—రంగయ్య బాకీ పూర్తిగా రద్దయితే మొత్తంలో సగం తమది.

ప్లీ:—సరే ఇకవిను. కోర్టువారు నిన్నుపిలిచి యేమడిగినా జవాబుచెప్పక "బే" అను. పొరపాటునకూడా మాట్లాడవద్దుసుమా బాగాజ్ఞాపకముంచుకో.

సు:—చిత్తం ! అట్లానే అంటాను - ఇంక సెలవుతీసుకుంటూ - నమస్కారం -

ప్లీ:—మంచిది.

(సుబ్బయ్య నిష్క్రమించును)

## మూడోరంగము

(కోర్టు జడ్జీ, ప్లీడరు, వెంకట్రామయ్య వుంటారు. బంట్రోతు వాకిట్లోవుండి సుబ్బయ్య, రంగయ్య, అంటూ పిలుస్తాడు. వారిరువురు లోన ప్రవేశిస్తారు. బంట్రోతుకూడ లోనికొస్తాడు )

బం:—(సుబ్బయ్యకేసి చూచి) నీ తండ్రిపేరేమి?
సు:—"బే."
బం:—"దేవునియెదుట ప్రమాణంచేసి" అను.
సు:—"బే"
బం:—"అంతా నిజము చెప్పుతాను" అను.
సు:—"బే"
బం:—(కోర్టువారికేసి చూచి) అయ్యా! ప్రమాణము చేయడంలేదు.
జడ్జీ:—(సుబ్బయ్యకేసి చూసి) రంగయ్యకు నీవు ప్రైకము యియ్యాలా?
సు:—"బే"
జ:— (రంగయ్యకేసి చూచి) సుబ్బయ్య పిచ్చివానివలె వున్నాడు. నువ్వు సుబ్బయ్యకు బాకీపెట్టినమాట యెంతవరకునిజమో నమ్మలేకుండావున్నాను. కనక కేసు కొట్టివేస్తున్నాను.

(కోర్టు చాలింపు - అందరూ నిష్క్రమింతురు)

నాలుగోరంగము

(కోర్టువెలుపల - వకీలు వెంకటామయ్య - సుబ్బయ్య)

ప్లీ:—సుబ్బయ్యా! రంగయ్య బాకీ రద్దయితే మొత్తములో సగముఫీజుగా యిస్తానన్నావుకదూ?
సు:—"బే"
ప్లీ:—నాకిస్తానన్నా ఫీజియ్యి.
సు:—"బే"
ప్లీ:—ఇదీ బాగానేవుంది. రంగయ్య బాకీని యెగబెట్టే ఉపాయంచెప్పితే-ఆ ఉపాయమే నాఫీజు నెగబెట్టడానికి కూడా ఉపయోగించావు! బలేబుద్ధిమంతుడవు.

(అంటూ ప్లీడరు నిష్క్రమించును.)

సుబ్బయ్య నవ్వుకుంటూ పోవును.

---

# దేశభక్తుడు

మూలము:— పాండేయ బేచన్‌శర్మ - అనువాదము: నడింపల్లి వెంకటసుబ్బారావు.

"నాథా! ఎట్టి ప్రాణిసృష్టివల్ల మనకు గౌరవముకలుగునో అట్టి ప్రాణిని సృష్టించండి. యేం?

'నిజంగానా? ప్రేయసీ! పనిపాటలు వదిలేసి నా సృష్టిని పరీక్షించడానికొచ్చినట్లుందే? ఏదో కొంప మునిగిందన్నమాటే!

"హరి హరి ! ఏంమాట లవి. మిమ్ముల్నేనా పరీక్షించడం ! ఊరికే సూటి పోటుమాటల్తో చంపేస్తారెందుకు? నేనుకూర్చొని, మీఅద్భుతసృష్టియైన మృత్యులోకమును చూస్తున్నాను, విసుగెత్తింది. ప్రపంచములో ప్రధానత్వమే నశించిపోయింది. ఎటు చూచినా పురాణగాధలే. ఒకటి యేడుస్తుంది; మరొకటి నవ్వుతుంది; వేరొకటి ప్రేమిస్తుంది; యింకొకటి అత్యాచారాలు చేస్తుంది. రాజులు భిక్షుకులుకావడం, భిక్షుకులు రాజులుకావడం. వీరిలో ప్రత్యేకత యేముంది. ఏదేని మనోరంజక రచన చేయాలని ప్రార్థిస్తున్నా. ప్రపంచంలో మిమ్మల్ని శాపనార్థాలు పెట్టేవాళ్లేకాని, దీవించేవాళ్లెవ్వరూలేరు. వారి దీవెనల్ని గూడపొందండి, యెందుకైనామంచిది ?

" ఆ. బాగుగాచెప్పావు చిత్తంగూడ ప్రసన్నగావుంది. సృష్టికికావలసిన సరుకు సరంజామా అంతా సిద్ధంచెయ్యి. ఇప్పుడే నీ యెదురుగానే, నీ సహాయంతో సృష్టిచేస్తే!

" నేనా ! మీకుసహాయమా ? అయినట్లే సృష్టి. ఆయోగ్యతే నాలోవుంటే మిమ్ముల్నింత కష్టపెడతానా ?"

" కోప్పడవాకోయ్, భాయ్. నిన్న బొమ్మల్ని చెయ్యమంటున్నానా? గప్‌చిప్‌గా కూచో అం ! అప్పుడప్పుడు నాకృతివైపు, నావైపు, నీమధుర కటాక్ష వీక్షణాలు పారేస్తేచాలు, నాసృష్టికిప్రాణం వస్తుంది. తెలిసిందా ?"

" తెలిసింది ! చూస్తున్నా నీస్వభావంకలియుగంలో ముసలిపారైంది. ఇంకా నీనేత్రాల్లో యౌవ్వనకాంతులు ప్రకాసిస్తూనేవున్నై"

" మరి నీస్వభావం మాత్రం బాగావుంది కామోసు.ముసలిమార్వాడీ కామిని మోస్తరు. యెప్పుడైతే అయిపోయినావో అప్పుడేపిల్చి పిప్పిచేస్తుంది. పద, త్వరగా సరంజామాతయారుచెయ్యి."

౨

పృధ్వ్యాపస్తేజోవాయు రాకాశాల సమ్మిశ్రణతో ఒకబొమ్మను తయారు చేశాడు విధాత. ఒక తేజాన్ని ప్రవేశింపజేశాడు దాంట్లో. తరువాత సౌందర్యము, దయ, కరుణ, ప్రేమ, విద్య, బుద్ధి, బలం, సంతోషము, ఉత్సాహము, ధైర్యము, గాంభీర్యము మొదలయిన సమస్తసద్గుణాలను సమకూర్చాడు. ఆఖరున ఆయువును, భాగ్యరేఖను, లిఖించడానికి విధాత లేఖినిని కదల్చేటప్పటికి బ్రహ్మాణి అడ్డుపడి—

"ఏం వ్రాయబోతున్నారు యితని భాగ్యరేఖలో ? ఆయుఃపరిమాణమెంత నిర్ణయించారు ?"

"ఏం, వాటితో నీకేంపని ? తమాషా చూస్తానన్నావు, చూడు. కోప్పడటం లేదుగద, కొంపతీసి. ఇతనిభాగ్యరేఖలో భయంకరదారిద్ర్యము, దుఃఖము, చింత, ఆయువు ఇరవై సంవత్సరాలు, వ్రాశాను."

"అరె! ఇదేం తమాషాండీ ! ఇన్ని సుగుణాలిచ్చిన మీాదట దరిద్రం, దుఃఖం, చింత, మొదలైనవివ్వాలసిన యవసర మేమొచ్చింది? మళ్ళీ ఆయువుచూస్తే ఇరవై

యేండ్లే ! ఇందువల్లే మృత్యులోకకవి తమకు ఫిర్యాదు చేశాడు. మళ్ళీ యెవరిచేతనైనా "నామచతురాననకు మతిపోయిందా ?" అని వ్రాయించుకో దలచుకున్నారెట్లా ?

విధాతమందహాసుడై ---"ఇప్పుడు రచనపూర్తైంది. ఊరక తమాషాచూస్తుండు. తమాషా త్వరగా చూట్టం వీలవడంకోసమే ఆయువు తక్కువచేయడం "

"మర్త్యలోకంవాళ్లు యితనిని యేమని పిలుస్తారు" అని అడిగింది బ్రహ్మాణి.

" దేశభక్తుడు " అని ప్రజాపతి సగర్వంగా ప్రత్యుత్తరమిచ్చాడు.

3

ప్రపంచంలో దేశభక్తుల్ని ప్రవేశాన్ని అమరావతినుంచి యింద్రుడు, కైలాసనంనుంచి శంకరుడు, వైకుంఠంనుండి కమలాపతి చూస్తున్నారు. నెమ్మదిగా పందొమ్మిది వత్సరాలూ గడిచినాయ్, అప్పటికి విశేషాలేమీలేవు. మనకు అనేక శతాబ్దాలైతేనేగాని, దేవమండలికి ఒకసంవత్సరంగాదు. ఇకమన పందొమ్మిది సంవత్సరాలూ, ఒకనిమిషముకంటె తక్కువే !

దేశభక్తుని దర్శన మాత్రంచేత కాక భగవానుడైన కామారి ప్రసన్నుడై నాట్యం చేయడం మొదలుపెట్టాడు. పార్వతి దృష్టిని దేశభక్తునివైపు మరలుస్తూ "చూచితివా! అదిసృష్టిలోని ఒక అపూర్వరచన. దేవతలైనాసరే, దేశభక్తుని రూపం దాలిస్తే తమజన్మ ధన్యమైందని భావిస్తారు. ప్రియే, ఆశీర్వాదింపుము " అన్నాడు. 'దేశభక్తునకు జై' అని ఉమ ప్రసన్నవదనంతో ఆశీర్వదించింది. ఒకనాడు దేశభక్తుని తేజోవిరాజ మానముఖ మండలంపైకి ఉమదృష్టిపడింది. అకస్మాత్తుగా ఆసమయంలో ఆయన పిస్తోలుధారియై ఒక దేశద్రోహిని వెంటాడుతున్నాడు. ఇందిరాదేవి భయ కంపితయై విష్ణు దృక్కులనావైపు మరలుస్తూ ' ఆయనయెవరు ? ముఖమూ తేజో పూరితము, పవిత్రము, చేయబోవునదియూ రాక్షసకృత్యము-హత్య ! లీలాధరా ! యిదేమి లీల' అని అడిగింది. "ఉష్! గప్‌చుప్‌గాచూడు."పరిత్రాణాయసాధూనాం, వినాశాయ చదుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ దేశభక్తుడు చేయబోయ్యేడి రాక్షసకృత్యమైతే, రాముడు, కృష్ణుడు, ప్రతాపుడు, నెపోలియన్ మొదలైన వారంతా రాక్షసకృత్యాలు చేసినట్లే దేవీ వారికిప్రణమిల్లుము. ఇది భగవంతుని సృష్టిలో పవిత్రతరకృతి. * * *

"మూర్ఖా ! పశ్చాత్తాపుడవు కమ్ము. దేశద్రోహమునుండి విముక్తుడవై మాతృసేవకు ప్రతిజ్ఞపూనుము. లేనిచో చావుకు సిద్ధపడుము" అనిఅంటున్నాడు. దేశద్రోహి కణతలకు పిస్తోలు గురిచేసి దేశద్రోహి ముఖంపై అప్రయత్నంగా ఒక నవ్వు తాండవించినది. అది ఘృణాభిమానసమ్మిశ్రితము. "మూర్ఖుడా ! సావధానుడవు గమ్ము ! మేము శాసకుల ప్రేమపాత్రులము. మాయొక్క తల్లి, తండ్రి, సర్వము, సర్వశక్తివంతుడైన సామ్రాట్టు సామ్రాట్టుయుండా ? దేశంగొప్పదనం !" అని ప్రత్యుత్తర మిచ్చాడు. శాసకసమాజధోరణిలో దేశద్రోహి.

"విచారించుకో - మళ్లీ - ఆఖరుసారి. దేశమాత జయనినాదం చెయ్యి, లేదా చూడు" దేశభక్తుని పిస్తోలు ప్రేలడానికి సిద్ధంగావుంది.

"కుతికపైకివచ్చిన విషమపరిస్థితిని చూచి తనజేబులోనుంచి విజిల్ తీసి ఊదాడు. దేశద్రోహికి అనేకరహస్యరక్షణ లుంటవనుకుంటారు. రెప్పపాటుకాలంలో యిరవైమంది దేశద్రోహిదళం అమాంతంగా దేశభక్తునిపైకి లఘించింది. దేశభక్తుని పిస్తోలు 'ధాం' అని గర్జించింది. దేశద్రోహి నాయకుడు ఒకక్షణంలో నేలగూలాడు. పట్టుబడేముందు దేశభక్తుడు యత్నసిద్ధి పొందినందుకై ఆనందనిమగ్నుడై 'మాతాకీజై' అని అరిచాడు.

కంపిస్తూ యింద్రాసనమూ, పుష్పవృష్టికురిపించి నందనవనమూ, తాండవ నృత్యలీనుడై రుద్రుడు, కలకలరవసంచరిత సురసరిత ఏకకంఠంగా "దేశభక్తునకు జై" అన్నవి. ఇక విధాత "చూస్తున్నావా, దేశభక్తుని చరణ రజోవేశస్పర్శమాత్రాన దౌర్భాగ్య కారాగారాలు స్వర్గతుల్యాలుగా నెంచబడుచున్నవి. లోహ శృంఖలాలు స్పర్శవేదిపొందినవి. ప్రపంచ హృదయంలో ప్రసన్నతా తరంగా లుప్పొంగుతున్నాయి. ఇక వసుంధర సంతోషానికి మేరయేలేదు. ఇదినాకృతి. యిదినావిభూతి - ప్రేయసీ! మంగళగీత పాడుము.

ఈదినము సుదినము. నాలేఖిని ధన్యమైనది అన్నాడు బ్రహ్మాణితో.

౪

అవి దేశభక్తుని జీవితపాత్రమునందలి తుదిపుటలు. స్వర్గలోకంలోని సంతోషం అపారపారావారం అయిపోయింది. కల్పవృక్షం త్రింశత్కోటిదేవాంగనల పుష్పపాత్రికలను నింపింది. పుష్పాలతో, అమరావతి అపూర్వంగా అంలకరించినది. నలుదిశలా మంగళ వాద్యాలు చెలరేగుతున్నాయ్. దేవతాగణం నిర్ణీతకాలానికి ముందే విమానారూఢులై దేశభక్తుని ఆగమనాని కెదురు చూస్తున్నారు ఆకాశాన.

* * * * * *

చక్రవర్తి సమగ్రుడు. భీషణశస్త్రాస్త్ర సమన్వితుడై ఒకపెద్ద మైదానంలో నిలుచున్నాడు. చక్రవర్తికి వ్యతిరేకంగా విద్రోహం తలపెట్టాడనే నేరం మోపబండింది దేశభక్తుని మీద. న్యాయవిచారణ నాటకంసాగుతున్నది. దేశభక్తుడా! నీకృత్యములకు పశ్చాత్తాపం వెలిబుచ్చి చక్రవర్తికి జయనినాదం చేస్తావా? లేదా? యీశతఘ్నితో పేల్చెయ్యమంటవా" అనిగర్జిస్తూ అజ్ఞాపిస్తున్నాడు న్యాయాధీశుడు. దేశభక్తుడు పశ్చాత్తప్తుడౌతాడా? అతనిని శతఘ్ని కెదురుగా స్తంభానికి కట్టి వేశారు. "న్యాయరక్షణ కోసం చివరిసారి చెపుతున్నామళ్లీ, చక్రవర్తికి జయఘోషచెయ్యి."

"నేను పశ్చాత్తాప పడడంకల్ల మీపనిమీరు కానివ్వండి. మీరెందుకిలా బాధపడతారు? నిజమైన చక్రవర్తి యెవరు? మీమాటప్రకారం ప్రపంచదోపిడిగానిని చక్రవర్తిఅని యెలాఒప్పుకోనను? మానవద్రోహి సామ్రాట్టౌతాడా! సామ్రాట్టు

న్యాయాన్ని గొంతునులిమేస్తున్నాడు. సామ్రాట్టు యెవరిపైనైనా దౌష్ట్యాన్ని ప్రయోగిస్తాడా? సోదరా ! నువ్వు సామ్రాట్టసేవాణ్ణి, మానవత్వం మేమాత్రమైనాఉన్న వాళ్లేమంటారో? తెలుసా, "రాక్షసు" లంటారు. ఇకచక్రవర్తికి జయఘోష చేయడమెట్లా! నన్ను శతఘ్నిలో కాల్చివెయ్యి. అందువల్ల సామ్రాట్టుకు మంగళమవుతుంది. అతని పాపం బ్రద్దలై ముక్తి లభిస్తుంది.

* * * * * *

పంచభూతనిర్మితమైన ఒకబొమ్మను అత్యాచారోపాసకులు కొందరు శతఘ్నితో కాల్చి ఎగురగొట్టడంచూచారు, త్రింశత్కోటి దేవతలూ, మానవత్వపుటొడిలో కూర్చున్న దేశభక్తుడూ.

అట్లు భిన్నాభిన్నమైన ప్రత్యణువును సంచయనం చేసికొని దేవతలు అమూల్యరత్నాలవలె గొనిపోయినారు. దేశభక్తుని జయనినాదం దేవలోకంలో చాలసేపటివరకు ప్రతిధ్వనించింది.

---

# బాలనీతి

(గతసంచిక తరువాయి)

చిలకా వేంకటకృష్ణదాసు

తే. గీ. బడికిఁ బోవుచు నప్పుడు - వచ్చునపుడు
దృష్టి నటునిటు పోనిక - తిన్నగాను
బాటపై నొకప్రక్కగా - వడిగ నడచి
పోవ నెట్టిహానియు కల్గ - బోదు బాల !

తే. గీ. బంధుమిత్రులు పెద్దలు - వచ్చునపుడు
ఉచితమర్యాదలను సల్పి యుక్తమయిన
భాషణములతో వారి క - పారముదము
గలుగఁజేయుము శుభములు గలుగు బాల !

తే. గీ. పరిమళవిహీన మాటచే - నెఱుపురంగు
కలిగియున్నఁ గింశుకము శో - భిలనియటుల
మంచికులమును రూపసం - పదలు నున్న
విద్యలేక నరుండు శో - భిలడు బాల !

తే. గీ. స్వంతకార్యము విడనాడి - పరుల కుపకృ
తి సలుపఁగఁ బూను సజ్జనుఁ - డు సతతంబు

గాన పరులకు మేల్సేయు - గడఁగునపుడు
అనుసరించుము సుజనుని - గొనము బాల!

తే. గీ. కష్టములు వచ్చునప్పుడు - కలతఁజెంది
లలనవలె ధైర్యమును వీడ - లాభ మెమి?
కష్టమొక్కెడ నెప్పుడు - కాపురంబు
జేయఁబో దని యెఱుగుము - చిట్టిబాల!

తే. గీ. మనల నన్యులు బాధింప - మనకు నెట్టి
బాధ కలుగునో సర్వజీ - వముల కట్లె
బాధపెట్టిన కలుగును - బాధ యనుచు
నెఱిగి ప్రాణుల కొనరింప - కెగ్గు బాల!

తే. గీ. హితులుఁ జెప్పినమాటలు - సతము లాభ
దాయకంబులై యుండును - ధాత్రియందు
హితునిమాటలచే గాదె - యింపుమీఱ
ధరణిపతులైరి పాండునం - దనులు బాల!

తే. గీ. అణకువ గలిగి నీమార్గ - మందు నడువు
మెపుడు దారియందున పెద్ద - లెవరయినను
గోచరించిన వందన మాచరింప
కరుణ నీయెడ వారికి - గలుగు బాల!

---

# ఆరోగ్యమార్గములు

**వేదుల సూర్యనారాయణశాస్త్రి**

## 1. దంతధావనము

ప్రతిదినమును వేకువనేలేచి మెత్తని కుచ్చుకలిగినదియు, కణుపులు, పుచ్చులు, వంకరలు, లేనిదియగు పుల్లతో పండ్లు తోమవలయును. చేదుపుల్లలలో వేప, వగరుగలవానిలో తుమ్మ, చండ్ర, తీపిగలవానిలో యిప్ప, కారముగల వానిలో గానుగ యివి ఉత్తమమైనవి.

దంతముయొక్క మాంసమునకు నొప్పి గలుకనీయక మెత్తని పండ్లపొడితోగూడ తోముకోవచ్చును. బంగారు, వెండి, రాగి మొదలగు బద్దలతో నాలుకగీచి శుద్ధి చేసికొనవలెను.

## అభ్యంగనము

తైలముతో అభ్యంగనము చేయుట వలన శరీరమునకు మార్దవముగల్గును. దుమ్ము, పేలు, మురికి, మొదలగునవి పోయి, శిరోజములు నల్లగాపెరుగును. నొప్పులంతరించును. వృక్షమూల మందు బాగుగా త్రవ్వి నీరుపోయుచుండుట వలన ఆవృక్షమేరీతి చిగిర్చి పుష్పించి ఏపుగా నెదుగుచుండునో అటులనే శరీరమునకు

తైలముపూసినచో ధాతువులు వృద్ధియగుటయేగాక దృష్టినిర్మలము కాగలదు.

### వ్యాయామము - మర్దనము

దేహమునకు బలము, తేజస్సు, కండరాభివృద్ధి, దర్శనీయాకారము కలిగించుటయే దేహపరిశ్రమ యనబడును. శరీర స్థౌల్యమును తగ్గించుటకు వ్యాయామమే ముఖ్యము. నౌషధము వ్యాయామము చేయు మానవుని చెంతకు ముసలితనము త్వరగా రానేరదు. బలిష్ఠులకును, క్రొవ్వు పదార్థములు, పిండి, విశేషముగా తిను వారికిని, వ్యాయామము ముఖ్యము. ఇది శీత కాలము, వసంతకాలములయందు ముఖ్యముగా నాచరణీయము. దేశ, కాల, భోజన, బల, ప్రాయ, శరీరతత్వముల ననుసరించి ప్రతిమానవుడును దాని కనుగుణ్యమగు విధానములో వ్యాయామము ప్రతి దినమును చేయవలెను. మర్దనము, శరీరమునకు నలుగుపెట్టుట, వీనివలన శరీరము గట్టిపడుటయు, పరిశుభ్రముగ నుండుటయు గలుగును.

సాధారణముగా లోకములో కొందరు ఏమియునడక లేక సుఖముగా తినికూర్చుండి యుండుటవలన శరీరము స్థూలముగా పెరిగి సుకుమారులుగా నగుచున్నారు. సామాన్యమగు షికారీ నడకలవలన నియ్యవి అడగిపోవును. అధికముగా నడచియుండుట వలన దేహకాంతి తగ్గుటయు, దుర్బలత్వము కలుగుటయు, ముసలితనము వచ్చుటయు గూడ కలుగగలదు. ఒడలికి హెచ్చుశ్రమ కలిగింపక నడచుటవలన ఆయువు, బుద్ధి, బలారోగ్యములు, ఆకలి, గలుగును. ఇంద్రియములు చురుకుగాపనిచేయ సమర్థములగును. మంచిగాలివలన శ్రమతగ్గును. సుఖనిద్ర గలుగును. బలారోగ్యములు వృద్ధి కాగలవు.

### శుచి, స్నాన, భోజనాదులు

స్నానము శరీరమునందలి మురికిని బోగొట్టును. అన్ని ఇంద్రియములను పరిశుద్ధ మొనర్చును. బద్ధకము, మనోదౌర్బల్యము, నణంచును. సోమరితనముండదు. చన్నీటియందు పూర్ణాంగస్నానము చేయవలయును. ఇందువలన గలుగు అద్భుతఫలితము లనేకములు గలవు.

దినమునకు రెండు పర్యాయములు భుజించుటయే ఉత్తమము. ఉదయము 9 గం॥ల లోపున నేమియు తినరాదు. అప్పుడాకలివేసిన మంచినీరు మాత్రము త్రాగవచ్చును. మన శరీరము ఆరోగ్యముగ నుండవలెనంటే ఆహారనియమము సరిగ నుండవలయును. ఆహారము జీర్ణమై రక్తముగా మారిశరీరమునకు బలము, ఆరోగ్యమునిచ్చునదై యుండవలెను. అటుల నుండుటకు సాత్వికాహారమును సరిగా ఆకలియగునప్పుడు మాత్రమే మితముగా తినవలయును. ఆకలిలేనపుడు ఆహారస్వీకరణమే సర్వవ్యాధులకు కారణము.

తేలికగా జీర్ణమగునవియు, సాత్వికములగు ఆకుకూరలు, కాయకూరలు, పండ్లు, దంపుడు బియ్యము, మజ్జిగ తినవలయును. ఆహారము సరిగా శరీరమునందు ఇముడకముందు తిరిగి అన్నము తినరాదు. ఆహారము ఎంత నియమముగా నున్న నిద్ర, కామము ఇవి అంత నియమబద్ధములగును. హితమయినది జిహ్వాచాపల్యము వదలి మితముగా సకాలమందు భుజించుటొప్పు. ఒకసారి భోజనమైన తరువాత ఒకజాము లోపల తిరిగి ఏమియు తినరాదు. నిర్మలమైన

నీటిని త్రాగవలయును. బ్రహ్మచర్యము వలన శరీరబల మభివృద్ధినొందును. శుక్లము శరీరరక్షణకు ముఖ్యమయినది గాన జాగ్రత్తగా రక్షించుకొనవలయును.

నిద్రవలన శ్రమతగ్గి ధాతుబలము, పుష్టి గలుగును. నిద్ర లేకుండుటవలన శరీరము కృశించును. పగలు నిద్రపోరాదు. సాయంకాలమునందు స్నాన సంధ్యావందనము లాచరించి తేలికగా భుజించి పెందలకడ పరిశుభ్రమగు పాన్పు మీద పరుండవలెను. మనసు మేల్కొనియున్నప్పటికన్న నిద్రలో మనకు ఎక్కువ పరిశుభ్రమగు గాలికావలెను. అట్టిగాలిని పీల్చుటవలన శరీరమందలి మాలిన్యములు త్వరగా శుభ్రపడును. ఆహేతువువలన మంచి వాయు ప్రసారముగల చోట్ల నిద్రింపవలెను. తలుపులు, కిటికీలు మూసియు, దీపము ఎక్కువగా వెలిగించియు, ఉన్న గదులలో శయనింప రాదు.

మల మూత్రములను, తేనుపు, దగ్గు, తుమ్ము మొదలగువానిని నిలుపకూడదు. బలవంతముగా విసర్జించుటయు తగదు. గ్రామము, నగరవీధులు, దేవాలయము, శ్మశానము, నాల్గువీధులు గలియుచోటు, మంచినీటి చెరువు, దారినడచు మార్గము, వీనిసమీపమునందును, మరియొకరు చూచుచుండగను మలమూత్ర విసర్జనల విసర్జింపవలెను. ఎల్లప్పుడు నుదికిన శుభ్ర వస్త్రములనే ధరించవలెను. మనస్సును ఎల్లప్పుడు నుత్సాహముగా నుంచవలయును. సువాసనా ద్రవ్యములను పూసుకొనవలెను. తలవెంట్రుకలను చక్కగా దువ్వవలెను. తల, చెవులు, ముక్కులు, పాదములు, వీనియందు నిత్యము తైలము నుపయోగించవలెను. అయిదు దినముల కెక్కువకాకుండ తలవెంట్రుకలు, గోళ్లు, మీసములు తప్పక కత్తిరించవలెను.

నిత్యమును హితాహారములను సేవించుచు, యుక్తముగ నాలోచించి, తమకార్యములను చేసికొనుచు, దుర్వ్యసనాసక్తులుగాక, దాతృత్వము, సమబుద్ధియు, నిజమునందాసక్తియు, ఓర్పును గలిగి యదృచ్ఛాలాభముతో తృప్తినొందుచు నుండువారలు ఎల్లప్పుడును రోగము లేని వారుగా నుందురు.

---

# ఆంగ్లవిద్యార్థి

శ్రీమాన్ కె. వి. రంగాచార్యహారితస్

పరమతాంతరుడై "ఫాక్సో - బర్కో" నాగ
పేరు మార్చు నల్లనివానిఁ - బెద్దచేసి
ఆంగ్లభాషా కుమారి పెం - డ్లాడినంత
తెల్లదొరవోలె తన్నుదా - తెలియఁబోక
మత్తుచల్లిన చంబాన - మాతృభాష
మఱచిపోవు నల్లనిదొర - మారిపోవు.

ఎన్నిడిగ్రీలు బిరుదంబు - లెన్నియున్నఁ
గలుగఁబోవదు; అద్ది ముక్తసరి గాని
వ్యావహారిక భాషగా - వాడువఱకే !
అచ్చ తెలుగుపిల్లల కాంగ్ల - మసలురాదు
కొసరుగల దక్షిణోత్తర - కూర్మిసఖుల
స్నేహమున నేనిఁ బాశ్చాత్య - సేవ నేని
తాత తండ్రులు గూర్చిన - ధనచయంబొ
ముసలిముండలు దాచిన - మూలధనమొ
ఖర్చుపెట్టి నేర్చాంగ్ల ముక్కలకు రాక
భవ్యమైనట్టి సంస్కృత - భాష రాక
లలితమగు మాతృభాష మాట్లాడలేక
రెంటికిం జెడ్డ రేవడి యేయనంగ
స్వర్గమునకు నుట్టికిఁ గాక - బ్రదుకులేక
ఆంగ్లవిద్యార్థి నేడు దిక్కఱినాడు.

---

# సివిక్సు - ప్రశ్నోత్తరములు

(నాల్గవ తరగతి)



(ఏప్రిలుసంచిక తరువాయి)

వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు, బోర్డుస్కూలు, గురమ్మపాలెం,
తాతా జగన్నాథరావు, హెడ్మాష్టరు, బోర్డుస్కూలు, కొంర్యాం.

Syllabus Heading :—Difference between a Village and a town Illustrate with examples - how and by whom public affairsare managed-in a village and a town.

1. గ్రామమునకును, పట్టణమునకును గల తారతమ్యమేమి ?

జ: గ్రామములలో కన్న పట్నములయందు వర్తక వ్యాపారము బహుళ్యముగా నుండును పలు విధములగు యంత్రశాలలు, చేతిపనులు మున్నగు వాటికి ఏర్పాటులుండుటవలన జీవనోపాధిలభించును. విద్యాసౌకర్యములు ఎక్కువగానుండును; ప్రజల సదుపాయములకొరకు కావలసిన అవసరములన్నియు లభించును.

2. పట్నములయందలి కొన్ని ముఖ్యమగు కచేరీలను పేర్కొనుము ?

జ: పోలీసుస్టేషను, మేజస్ట్రేటుకోర్టు, జిల్లామునసబుకోర్టు, సబురిజిస్ట్రారుకచేరీ, పోస్టాఫీసు మొదలగు కచేరీలుండును.

3. యీదిగువ కచేరీలలో జరుగుపనులను క్లుప్తముగా వివరింపుము ?

1 పోలీసుస్టేషను. 2 మేజస్ట్రేటుకోర్టు 3 సబురిజిస్ట్రారుకచేరీ. 4 పోస్టాఫీసు.

జ: 1. పోలీసుస్టేషను ప్రజల మాన, ధన, ప్రాణములను కాపాడుటయే వీరిపని. ఇచ్చట పోలీసు భటులును, సబుఇన్స్పెక్టరును యుందురు. తమ అధికార ప్రదేశమున నేరములు జరుగకుండ చూచుటయు, నేరస్థులను పట్టితెచ్చుటయు మొదలగు దేశక్షేమమున కవసరమగు పనులు నిర్వర్తించెదరు

2. మేజస్ట్రేటుకోర్టు: పోలీసువారిచే కనుగొనబడినట్టియు, తమకు వచ్చునట్టియు నేరములను విచారించి నేరస్థులను శిక్షించెదరు.

3 సబురిజిస్ట్రారు కచేరి: ప్రజలు తమలోతాము చేసికొను వ్యవహారములలో వ్రాసుకొను పత్రములను రిజిష్టరు చేసెదరు.

4. పోస్టాఫీసు: ఉత్తరములు, మనియార్డర్లు, బంగీలు మొదలగునవి యిచ్చుటయు, పంపుటయు, మన ధనముదాచుట మొదలగుపనులను చేయుచు ప్రజలకు సౌకర్యములు గలుగజేసెదరు.

Syllabus Heading·—Madras Presidency-District officials; Municipalities for urban areas, their duties and responsibilities; Local taxation the journey of a Post card, a journey by rail

1. జిల్లాలోగల వేర్వేరు ప్రభుత్వశాఖలను పేర్కొని వాటి అధికారులను దెల్పుము ?

| శాఖ | జిల్లా అధికారి |
|---|---|
| 1. రివిన్యూ | కలెక్టరు |
| 2. న్యాయశాఖ | జడ్జి |
| 3. పోలీసు | సూపరింటెండెంటు |
| 4. ఆరోగ్యశాఖ | హెల్తు ఆఫీసరు |
| 5. విద్య | ఎడ్యుకేషనల్ ఆఫీసరు |
| 6. వ్యవసాయము | అగ్రికల్చరల్ ఆఫీసరు |
| 7. అడవులు | ఫారెస్టు ఆఫీసరు |
| 8. పశుపులవైద్యశాఖ | వెటర్నరీఆఫీసరు |
| 9. ఇంజనీరింగు | ఎగ్జిక్యూటివు ఇంజనీరు. |
| 10 రిజిస్ట్రేషను | డిస్ట్రిక్టు రిజిస్ట్రారు |

2. పురపాలక సంఘము వారివిధులను వివరింపుము ?

• జ: పురపాలక సంఘమువారు పట్నముల యందలి వీధులను శుభ్రము చేయించి, కల్మష పదార్ధములను తీయించి, మంచినీటి వసతుల నేర్పాటుచేసియు, రోడ్లు, సత్రముల నేర్పాటుచేసియు. మరుగుదొడ్ల నేర్పరచి వాటిని పరిశుభ్ర పరపించియు, రాత్రులయందు దీపపుటేర్పాట్లు చేసియు, విద్యాసౌకర్యములు గల్పించియు, ప్రజల ఆరోగ్యమునకును, సౌఖ్యమునకును తోడ్పడుచున్నారు.

3. పురపాలక సంఘమువారి రాబడులను దెల్పుము ?

జ: ప్రజలకు సదుపాయము లొనర్చుటకు ధనమావశ్యకము. ఇండ్లపన్నుల మూలమునను, ఆస్తుల మూలమునను, లైసెన్సులమూలమునను, వృత్తి, విద్య, నీరు మొదలగువాటిపై పన్నులమూలమున పురవాసులనుండి ధనము ప్రోగుచేసి ప్రజలసౌకర్యములకై పురపాలక సంఘము వారు వెచ్చించుచున్నారు.

4. ప్రభుత్వము వారేయే పన్నులను వసూలుచేసి యేయే సౌకర్యములు మనకు గలిగించుచున్నారు?

జ: ప్రజలనుండి భూమిపన్ను, ఇంటిపన్ను, రోడ్డుపన్ను, ఆదాయపన్ను, ఉప్పు, నల్లమందు, సారాయి మొదలగువాటిపై పన్నులు వసూలుచేసి, ప్రజల ఆరోగ్యమునకును, నీటివసతులకును, ధనమాన ప్రాణరక్షణమునకును, విద్యాభివృద్ధికిని, వర్తకవ్యాపార ప్రయాణసౌకర్యములకును వెచ్చించి మన అభివృద్ధికి ప్రభుత్వమువారు సర్వదా పాటుబడుచున్నారు.

5. బ్రాంచి పోస్టాఫీసులో పోస్టుచేయబడిన జాబు వేరొకబ్రాంచి ఆఫీసు అధికార ప్రదేశములోయున్న చిరునామా దారున కందుటకై చేయు ప్రయాణమును క్లుప్తముగా వివరింపుము ?

జ: బ్రాంచి పోస్టాఫీసు నందలి పోస్టుపెట్టెను పోస్టుమాస్టరు తెరచి అందులో వేయబడిన ఉత్తరములను తీసి ఉత్తరములపై నంటించబడియున్న బిళ్లపై పోస్టాఫీసుపేరును, తేదీని తెలియజేయు ముద్రను వేసి

ఉత్తరము నొకసంచిలో వేటి సీలు చేసి రన్నరుద్వారా సమీపమందలి సబుపోస్టాఫీసున కంపును అచటయీఉత్తరములను సబుపోస్టాఫీసుల వారీగా విభజించి వేర్వేరు సంచులలోకట్టి సీలుచేసి రైలునకంపుదురు. రైలులోనుండు పోస్టు ఉద్యోగులు ఆసంచులను ఆయాపట్నములలో యిచ్చెదరు ఆపట్నములలోనుండు సబుపోస్టుమాస్టరు తనకు వచ్చిన సంచులను విప్పి అందలి ఉత్తరములపై ముద్రవేసి, బ్రాంచి ఆఫీసులకు సంబంధించిన ఉత్తరములను కట్టలుకట్టి, వేర్వేరు సంచులలో వేసి రన్నరులద్వారా ఆయా బ్రాంచి ఆఫీసుల కంపుదురు. ఉత్తరములు బ్రాంచి ఆఫీసులో మరల ముద్రవేయబడి చిరునామా దారులకు బట్వాడా చేయబడును.

6. ప్రాముఖ్యమగు ఆరు కాలినడక నిబంధనలను తెల్పుము ?

జః 1. రోడ్లపై నడచునపుడు ఎడమచేతివైపు నడువవలెను.

2. రోడ్లమధ్య నిలువబడి ఒకరితో నొకరు మాట్లాడరాదు.

3. రోడ్డుమీద పండ్ల తొక్కలను, గాజుపెంకులను పడవేయరాదు. అవి కన్పించినచో తీసి పారవేయుట మంచిది.

4. రోడ్లపై ఆటలాడరాదు.

5. రోడ్లను దాటునపుడు రోడ్డుమధ్యకు పోవువరకు కుడివైపునను, మిగతసగమున ఎడమవైపునను బండ్లు మొదలగునవి రాకుండ చూచుకొనవలెను.

6 రోడ్లపై బండ్లను, బస్సులను ఎక్కునప్పుడును, దిగునప్పుడును ఎడమప్రక్కలనే ఉపయోగించవలెను.

---

# హిందూదేశ చరిత్ర - ప్రశ్నోత్తరములు

## నాల్గవ తరగతి



(ఏప్రిలు సంచిక తరువాయి)

వేదుల అన్నయ్యశాస్త్రి - హెడ్మాష్టరు - బోర్డుఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.
తాతా జగన్నాథరావు - హెడ్మాష్టరు - బోర్డుఎలిమెంటరీస్కూలు, శొంఠ్యాం.

Syllabus Heading —The Story of Muhammad the prophet.

1. ప్రవక్తయన నర్థమేమి ?

జః ప్రవక్త అనగా మతోద్ధరణకై భగవంతునిచే పంపబడిన వాడని యర్థము.

2 మహమ్మదెవరు ? ఎవరిచే బాల్యమున పెంచబడెను ?

జః మహమ్మదు అరేబియాయందలి మక్కా పట్టణమున క్రీ. శ 570 లో ఒకరాజవంశమున బుట్టెను. ఇతని కుటుంబీకులు మక్కాలోని కాబాయను ఆలయమున కధికారులు. తల్లిదండ్రులు బాల్యమున మరణించుటచే పినతండ్రిచే పెంచబడెను

3. మహమ్మదెవరి నెట్లు వివాహమాడెను ?

జః మహమ్మదు ఖదీజాయను ధనవంతురాలి కొలువులో ఉద్యోగమునకు కుదిరెను. యీతని సుగుణములను జూచి ఆమె మహమ్మదును వివాహమాడెను.

4. మహమ్మదు మతోద్ధరణకై ఏలపూనుకొనెను ? ఆమతమేది ? దాని సారాంశమేమి ?

జ: మహమ్మదు బాల్యము నుండియు దైవభక్తిగలిగి, తన దేశీయుల మూఢవిశ్వాసములకు, విగ్రహారాధనలకు వగచి, దేశమును బాగుచేయవలెనను తలంపుతోనుండెను. ఆయన తన 40 వ ఏట ఒకానొకదినమున హైరాపర్వతముపై నుండగా జ్ఞానోదయమయ్యెను. అంతటి నుండియు జనులకాతడొక క్రొత్తమతమును బోధింపసాగెను తనమతమునకు ఇస్లాము మతమందురు దేవుడొక్కడేయనియు, విగ్రహారాధన చేయకూడదనియు, దేవుని కందరు సమానులనియు అతడు తనమతమున బోధించెను. యీమతస్థులే ముసల్మానులు లేక మహమ్మదీయులు.

5. ఖురాను అన నేది ? యిదెవరి మతగ్రంథము ?

జ: మహమ్మదు యొక్క మతబోధలన్నియు ఖురాను అను గ్రంథమున వ్రాయబడినది. యిదియే ముసల్మానుల ఉత్కృష్టమతగ్రంథము.

6. హజీరా అననేమి ?

జ: మహమ్మదుచే స్థాపించబడిన మతము మక్కాలోని అరబ్బుల కిష్టము లేనందునవారు మహమ్మదును చంపదలచిరి యిది గమనించి 622 వ సంవత్సరమున మక్కానుండి మహమ్మదు మదీనాకు పారిపోయెను. దీనినే హజీరా యందురు. అనగా పారిపోవుట యని అర్థము. మహమ్మదీయ శకారంభము హజీరానుండియే

7. మహమ్మదెపుడు మరణించెను ?

జ: మహమ్మదు క్రీ. శ. 636 లో మరణించెను.

Syllabus Heading.—The Pallavas, The story of Mahabalipuram.

1. పల్లవరాజుల రాజ్య మెంతవరకు వ్యాపించెను ? వారి రాజధానియేది ?

జ: పల్లవుల రాజ్యము దక్షిణదేశమందలి ఉత్తర దక్షిణ పెన్నానదులమధ్య నుండెడిది. రాజధాని (కంచి) కాంచీపురము.

2. పల్లవులను గూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: పల్లవరాజులు శౌర్యవంతులు, విద్యావంతులు వీరు శిల్పిశాస్త్రమును, అరవ, సంస్కృత భాషలను పోషించిరి వీరిలో మత్తవిలాసమను ప్రహసన నాటకమును సంస్కృతమున రచించిన మహేంద్రవర్మయు, పశ్చిమచాళుక్యులను జయించి వాతాపికొండయను బిరుదుగాంచిన నరశింహవర్మయు ముఖ్యులు. యీరాజులు కాంచిపురమందును, మహాబలిపురమందును కట్టించిన దేవాలయములు, కట్టడములు బహు చిత్రమైనవి. వీరు దక్షిణదేశమును సుమారు 400 సంవత్సరములు పాలించి తుదకు చోళరాజులచే నోడింపబడిరి.

3. మహాబలిపుర మెచ్చటగలదు ? యీ పురవిశేషములేమి ?

జ: మహాబలిపురము చెన్నపురికి దక్షిణమున 30 మైళ్లదూరమున గలదు. ఇది పురాతన స్థలము. యిందనేక దేవాలయములుగలవు. పూర్వమీపురము, అందలి ఆలయములు సముద్రమున మునిగిపోవుటచే, తిరిగి యీనగరము ఆలయములు నూతనముగా నిర్మింపబడినవి. ఇచ్చట ఏడు పెద్ద రాతిరథములు గలవు. ఇచ్చటి శిల్పిచాతుర్యము వర్ణనాతీతము.

Syllabus Heading —The Rajputs, their characteristics.

1. రాజపుత్రులెవరు ? వీరెపుడు రాజ్యములను స్థాపించిరి ?

జ: ఆర్యావర్తమందలి రాజపుత్రస్థానమున నివసించువారిని రాజపుత్రులందురు. వీరు శుద్ధమగు ఆర్యులు. వీరికితరమతములతో సంబంధములేదు. వీరు హర్షుని అనంతరము సుమారు 500 సంవత్సరములకు ఉత్తరహిందూస్థానములో చిన్నచిన్న రాజ్యముల నేర్పరచి రాజ్యమేలిరి.

2 రాజపుత్రుల లక్షణములేవి ?

జ: వీరు సుందరులు, పరాక్రమవంతులు. ధైర్యసాహసములుగలవారు ప్రాణమున్నంతవరకు యుద్ధ

భూమిని విడువరు. వీరికి దయాదాక్షిణ్యములు మెండు. శరణాగతవత్సలులు, స్వతంత్రప్రియులు, సత్య వాక్పరిపాలకులు, రాజభక్తి తత్పరులు.

3. రాజపుత్రస్త్రీల సహజలక్షణములను వర్ణింపుము ?

జః వీరు యుద్ధమునందారితేరినవారు. పతిభక్తిగలవారు పాతివ్రత్యమును కాపాడుకొనుటకై అగ్నిలో బడి మరణించు స్వభావముగలవారు.

4 రాజపుత్రుల సంఘీభావమునుగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జః వీరికి సంఘీభావములేదు. వారిలోవారు తరుచు పోరాడుచుండిరి చిన్నచిన్న రాజ్యములను స్థాపించుకొని స్వలాభమునకై తమలోతాము పోరాడుకొని క్రమక్రమముగా బలహీనులైరి వీరి సంఘీభావ లేమివలననే మనదేశము అన్యదేశీయుల వశమైనది.

Syllabus Heading :—The Muhammadan invasion

1. మనదేశముపై మొదట దండెత్తివచ్చిన మహమ్మదీయులెవరు? వీరిఏలిక నేమందురు ?

జః మనదేశముపై మొదట దండెత్తివచ్చిన మహమ్మదీయులు అరబ్బులు వీరుమతమునందుఎక్కువ పట్టుదలగలవారు. వీరిఏలికను ఖలీఫాయందురు.

2. అరబ్బులేయుద్దేశ్యముతో మనదేశముపై దండెత్తివచ్చిరి? దానిఫలితమేమి ?

జః మనదేశమును జయించి మతమును స్థాపించు నుద్దేశ్యముతో అరబ్బులు సింధునదీతీరమునకు సముద్రముమీదుగావచ్చి చేరిరి కాని సింధురాజుచే రెండుసార్లు ఓడింపబడిరి మూడవసారి సింధురాజు మరణించుటవలన అరబ్బులు సింధురాజ్యమున చాలభాగ మాక్రమించుకొనిరి. కాని పిమ్మట సింధురాజ్యముపై అశ్రద్ధవహించినందున సింధురాజులు స్వతంత్రులైరి.

3. సభక్తజన్ ఎవరు ? అతడు మనదేశమున ఎవరినోడించెను ?

జః అరబ్బుల తర్వాత ఆఫ్గను దేశస్థుడగు సభక్తజను మనదేశముపై దండెత్తి పంజాబునేలుచున్న జయపాలు నోడించి కొంతధనము తనదేశమునకు గొంపోయెను.

4. గజనీమహమ్మదెవరు ? మనదేశముపై ఏయుద్దేశ్యముతో నెన్నిసార్లు దండెత్తి వచ్చెను?

జః గజనీమహమ్మదు సభక్తజను కుమారుడు. మహమ్మదీయ మతమును మనదేశములో వ్యాపింప దలచియు, మనదేశమందలి అపూర్వ ధనరాసులను దోచుకొనదలచియు, మనదేశముపై క్రీ. శ. 1002 సంవత్సరమునుండి పదిహేడుసారులు దండెత్తివచ్చెను.

5. గజనీ యొనర్చిన క్రూరకృత్యములేమి ?

జః మనదేశములో అనేకమంది హిందువులను జంపియు, గుజరాతు దేశమందలి సోమనాథ దేవాలయము మొదలగు దేవాలయములను ధ్వంసముచేసి, విగ్రహములను నాశనముచేసి, వజ్రవైఢూర్యములు మొదలగు ధనరాసులను దోచుకొని తనదేశమునకు మరలెడివాడు.

6. గోరీమహమ్మదేయుద్దేశ్యముతో మనదేశముపై ఎన్నిసార్లుదండెత్తివచ్చెను ? దానిఫలితమేమి?

జః హిందూదేశమును జయించి తనరాజ్యమును స్థాపించవలెననియు, హిందువులను మహమ్మదీయులుగా జేయవలెనను తలంపుతో గోరీమహమ్మదు మనదేశముపై గజనీమహమ్మదు తర్వాత 150 సంవత్సరములకు ఏడుపర్యాయములు దండెత్తివచ్చెను కాని అజ్మీరు రాజగు పృథ్వీరాజుచే తరిమివేయబడెను.

7. గోరీ యుద్దేశ్యము తుదకెట్లు నెరవేరెను ?

జః కొంతకాలమునకు కనోజిరాజగు జయచంద్రునకును, అజ్మీరు రాజగు పృథ్వీరాజునకును వైరము సంభవించెను. అంతట జయచంద్రుడు గోరీ సహాయ మపేక్షించెను. సమయముకొరకు నిరీక్షించుచున్న గోరీమహమ్మదు జయచంద్రుని సహాయమున పృథ్వీరాజు నోడించి 1193లో మహమ్మదీయరాజ్యమును మనదేశములో స్థాపించెను. పిమ్మట జయచంద్రునిగూడ నోడించి కనోజిరాజ్యమునుగూడ తన రాజ్యమున గలుపుకొనెను.

# ఉపాధ్యాయ సాంఘిక సమస్య

"ఉభయభాషా ప్రవీణ" పండిత గుఱ్ఱప్పడియ ఆంజనేయులు P. O. L
గుఱ్ఱప్పడియ సత్యనారాయణమూర్తి
[సోదరకవులు - ఉపాధ్యాయులు]

శ్లో॥ శ్రీమద్భాంధ్ర మకుటాయితోత్త మాధ్యాపకాః సహానిజాధికారిభిః
సత్కృపామృత రసైకనీరదా, శారదాఽవతు ! కళావిశారదా.

శ్లో॥ యల్లోకానాం పరమసుఖదం, సర్వధీమత్ప్రసేవ్యం
కావ్యాకారం, కలిమలహరం, ఖండితాజ్ఞానపాశం
ప్రాణాధారం, ప్రణవలసితం, పాతున స్త్వీయభక్తా
నత్యంతం, తన్నిగమవినుత, చాక్షరబ్రహ్మతత్త్వం.

శ్లో॥ సర్వదా సర్వదా హ్యాస్మిన్ సర్వథా యాకలౌయుగే
భవేద్బోధకవర్గేసా సంఘశక్తి శ్శివంకరీ.

సీ. అత్యవిద్యా తమోవ్యాప్త సర్వంసహాఽ, నూన విజ్ఞానభా నూదయంబు
విపులసౌఖ్యద విశ్వ విశ్వసౌభాగ్య ధీ, లక్ష్మీ జయధ్వ జాలంబనంబు
నిరుప మాత్మానందకర శాంతిసామ్రాజ్య, సాధ కాక్షరత త్త్వ బోధకంబు
ఐహి కాముష్మి కైకాస్ప దామలశీల, తరుణ వల్లీప్రాణధారకంబు
దైవసమ్మిత యోగ్యతా పావితంబు, త్యాగ భావైక దివ్యసుధాకరంబు
అది జగద్వందితంబు చెన్నందు నొకటి, ధర సదర్థక మగుచు బోధకపదంబు. 1

సీ. తెలతెలవారుబోఁకల దైవనుతులతో, ననుదినంబును మేలుకొనెడువారు
శిష్యవర్గముతోడ సెలయేటి తెలినీట, నఘమర్షణస్నాన మాడువారు
చెలువారు మావిగున్నల తీయనీడలఁ, దిరమైనవిద్య బోధించువారు
ప్రకృతిలోఁగల విశ్వపతి మహామహిమంబుఁ, దేటయౌ నుడులఁ జిత్రించువారు
మేల్మిగొనముల వేల్పుల మించువారు, వెలయుచున్నారు మనమనోవీధులందు
నేఁటికిని పూర్వభారతనేత లనఁగఁ, దగిన మహదార్యబుషు లుపాధ్యాయవరులు.

సీ. అజునకన్నను మిన్నయైన పోఁడిమిఁ గన్న, శ్రీరామగురుఁడు వసిష్ఠమౌని
వేల్పుబాసను గల్గు వెలలేనిసారంబు, లోకుల కిడిన వాల్మీకిసుకవి
తేకువ నిగమముల్ దీర్చి దిద్దిన సాహి, తీశాలి సత్యవతీభవుండు
తన వైదుషీధనంబున శంభు మెప్పించి, ప్రఖ్యాతి నందిన భార్గవుండు
కావ్య తత్త్వార్థ దాయక కల్పలతల, నాటి పెంచిన యల మల్లినాథసూరి
ప్రాపుఁ గని పెంపునొందినపదవి మీది!, ధన్యజన్ములు మీరుపాధ్యాయులార !.

సీ. జనచయం బెల్ల "నాచార్యదేవోభవ", యను ధర్మపథమునఁ జనెడునాఁడు
అరయ నేయిలు పచ్చనైనను మునుమున్నె, గురునిముంగిటఁ బైడిగురియునాఁడు

తేసియానతికన్న మానితంబుగ నొజ్జ, నుడుల కెల్లరుఁ గట్టువడెడునాఁడు
సదమ లాచారులౌ ఛాత్రులు కనుసన్న, నిష్టకార్యంబు నిర్వహించునాఁడు
మించుభక్తి నిన్నృపులు మన్నించునాఁడు, ప్రాంచులౌ సత్కవులు గారవించునాఁడు
నాఁడు మనపూర్వు లెట్టియున్నతిని గనిరొ!, మనసునకుఁ దెమ్మ! నిముసమైనను
వయస్య !. 4

సీ. కలుఁగవే చూడు! చుక్కలందాఁకు భవనముల్, వనసీమ లేనాఁటి వసతియిండ్లు
లేకున్నె చూడు! కుర్చీ ల్మేల్మిబెంచీలు, క్రొంబచ్చిక యె నాఁటి కుదురుపీట
వెలయవే చూడు! వింతల వస్తుసంతతుల్, ప్రకృతియే నాఁటి బోధకునితోడు
తెలియదే చూడు ముద్రితకావ్యలోకంబు, తాటియాకు లె నాఁటి పాటకములు
కాలపరివర్తనంబునఁ గలుఁగు నేఁటి, తళుకుబెళుకుల కెడమయ్యె నలఘుకళల
కగ్రగణ్యంబు లవి డాంబికాహితములు, తొల్లి మనసీమఁ గల్గిన పల్లెబడులు. 5

* * * * * * *

మ. మనదేశీయుల భాగ్యహైన్యమున శుంభత్తేజమౌ భూమిపా
లనికాయం బడుగంటె, దుర్జనులపాలై, "మాలిమిన్ బాసి, వా
రినిధిన్ ద్రిమ్మరు తెప్ప"యైనభరతోర్విన్ చిన్నమయ్యెన్ సుధీ
ధనసంపత్తియు నయ్యరాజక మహోద్యద్భూతనాట్యోద్ధతిన్ ॥ 6

ఉ. వేయివిధంబులన్ గవిసి పేర్చిన గాటపుకాఱుచిచ్చునన్
దీయని పూలతీవెగతి నిష్ఠురమౌ తదవస్థయ్యం దుపా
ధ్యాయచయావ్యయోన్నతి యథాయథమై చనె దిక్కులేక "న
య్యో! యొకరీతిమై నడువ నొల్లవుగా పరమేష్ఠిచెదముల్" ॥ 7

మ. అనుకొన్నన్ మెయి గంపమొందు భయదంబౌ నవ్విపత్కాల మ
ల్లన దూరంబునకేఁగ, నంతట నమల్లానంబునన్ దూర్పు చా
యను దోచెన్ నవశాంతి జీవనదమై యాంగ్లేయ సామ్రాజ్యకే
తనరత్నేంద్రధనుఃప్రభాపటలసంతానం బహామ్యంబుగన్ ॥ 8

శా. ఆతారుణ్యదయారసైకనిధియౌ నాంగ్లేయ రాజ్యేందిరా
శ్వేతచ్ఛత్రమునీడ గ్రమ్మఱ జనించెన్ జీవితాశాంకుర
వ్రాతం బించుక బాలభారతికి సగ్రామంబులన్ గూడ సం
భూతం బందె ననేకముల్ బడులు విస్ఫూర్తిన్ గ్రమప్రక్రియన్ ॥ 9

చ. పలువురు పాలకుల్ వొడము, బాలసరస్వతి కోపిసంత పెం
పెలయుఁగఁ జేయనుండి, రవనీశులు నెయ్యముఁ జూపుచుండి రె
వ్వలనను, పారశాలలును వర్ధిలె నైనను నిక్కమెంచినన్
గలుఁగదు నేఁటికిన్ విజయగౌరవ మక్కట! గ్రామవిద్యకున్ ॥ 10

ఉ. పేరును బెంపుఁ గల్గఁ దొలివిద్దెకుఁ బ్రోదియొనర్చి పూర్వమీ
భారతభూమికిన్ విపులభాగ్యముఁ గూర్చిన పంచసూత్రముల్

జూతెను నాటినాటి కవళంబుగ, నెమ్మది నూహసల్పినన్
గారణముల్ బదింబదిగఁ గన్పడు నేటికి వానిఁబేర్కొనన్ ! 11

సీ. అర్భక శ్రేయోఽర్థియౌ నుపాధ్యాయుపై, గ్రామవాసుల కుండు గౌరవంబు
ప్రౌఢల్ల విద్దెల బోధించు నొజ్జకు, భావ మింపగు సౌఖ్యజీవనంబు
తమకు నవ్యోజ్జీవనముఁ గూర్చు గురునిపై, శిష్యుల కలరు విశిష్ట భక్తి
అజ్ఞాన హారణుఁడౌ నధ్యాపకున కైన, ప్రభుసత్తములతోడి పరిచయంబు
శిష్టులౌ బాలభారతీ సేవకులను, సహజముగ నొప్పు నన్యోన్యసమరసంబు
మూలసూత్రంబు లివియె విద్యాలతాభి, వర్ధనంబున కో మిత్రవర్యులార ! 12

సీ. కలుఁగ దించుకయైనఁ గంచు దివ్వెలతోడ, గమనించినను పౌరగౌరవంబు
కనుపట్ట దణుమాత్రమును శిష్యగణమున, సాంప్రతంబుగ సదాచార్యభక్తి
చేకూర దెంత కష్టించినన్ గడకెంత, కూటికి సరిపోవు కూలియైన
లభియింప దొక్కవేళను తపించినఁగూడఁ, దమ పాలకుల దివ్యదర్శనంబు
వెలయ దాత్మీయ సాంఘిక విపులశక్తి, నేఁటికైన నుపాధ్యాయ కోటియందు;
ఇంక నేలీల ముదితయై యొసఁగఁ గలదు ?, శారదాదేవి భారతజాతిలోన ! 13

చ. తమతమజీవితంబుల నుదాత్తసుమంబులుగా నిజాంఘ్రియు
గ్మమునకుఁ బూజసేయు గుణగణ్యులు బోధకు లాత్మవేదనన్
గమరుచు మేడిపండ్లవలెఁ గాలముఁ బుచ్చుచు నుండు నంత
కాలము జనయిత్రి వాగి సువిలాసము నెవ్విధి నొందఁజాలెడిన్ ! 14

—సశేషము

---

# సృష్టి పరిశీలన - ప్రశ్నోత్తరములు

(నాల్గవ తరగతి)



(ఏప్రిలునంచిక తరువాయి)

వేదుల అన్నయ్యశాస్త్రి - హెడ్మాస్టరు - బోర్డుస్కూలు - గురమ్మపాలెం -
తాతా జగన్నాధరావు - హెడ్మాస్టరు - బోర్డుస్కూలు - కొంత్యాం.

ప్ర. ఈ యీదిగువ ఫలముల విత్తనము లెవరిచే ఎట్లు వ్యాప్తిచెందుచున్నవి ? మామిడి, సీతాఫలము, పనస, మఱ్ఱి, వేప, జిల్లేడు, బెండ, కొబ్బరి.

జ: మామిడి, సీతాఫలముల రుచికాశించి మానవులు వాటిని తిని విత్తులను పారవేయుటవలన వ్యాప్తిచెందుచున్నవి.

పనస ఫలమును నక్కలు, ఎలుగులు తిని విత్తులను మలముద్వారా విడుచుటవలన వ్యాప్తి నొందుచున్నవి

మఱ్ఱి, వేప ఫలములను పక్షులుతిని మలముద్వారా దూరప్రాంతములలో విడుచుటవలన వ్యాప్తి నొందుచున్నవి.

జిల్లేడుకాయలు పగిలినతోడనే వాటిగింజలు తమకంటుకొనియున్న దూదిసహాయమున గాలిలో నెగిరి వ్యాపించుచున్నవి

బెండ గింజలు సూర్యరశ్మివలన పగిలి దూరముగా వ్యాప్తిచెందుచున్నవి.

కొబ్బరి: తీరప్రాంతములందలి కొబ్బరిచెట్లఫలములు నీటి ప్రవాహమువలన వ్యాపించుచున్నవి.

Syllabus Heading:—Observation of the appearance and habits of few common insects.

**1.** యీదిగువ కీటకములనుగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

1 దీపపుపురుగు 2. మిడుత 3 దోమ 4 మొక్కపేలు 5. సీతాకోకచిలుక.

జ. 1. దీపపుపురుగు :ఇది నిశాచరము. శరీరము వెడల్పుగానుండును. పుష్పములలోనిమకరందమును త్రాగును డింభదశయందు కాపువాని కిదిశత్రువు.

**2.** మిడుత: ఇది శాఖాహారి దీనినోరు తృణజాతి మొక్కలను మెక్కుట కనుకూలముగానుండును వెనుకకాళ్లు పొడవు దీనినే గొల్లభామయందురు యీమిడుతలదండు క్షామ సూచన

**3.** దోమ: ఇది మురికినీటి తావులలో నుండును ఎనాఫిలిస్ అను దోమవలన మన్యపుజ్వరమును స్టిగోమియా యను దోమచే పచ్చజ్వరమును గల్గును.

4 మొక్కపేలు: ఇదిగుంపులుగ ఆకులపై నివసించి మొక్కయొక్క పోషకరసమును పీల్చుకొని చెట్లను పాడుచేయును

**5.** సీతాకోకచిలుక: డింభదశయందు చెట్లఆకులను తిని పాడుచేయును.

---

# విమానమార్గములు

(Copy right to the author)

తాతా పాపారావు.

(రామరామ శ్రీరామ రామరామ శ్రీరామ) అనువరుస

పల్లవి॥ "ఇండియా" నుండి విమానమార్గము లితరదేశములకు
ఎన్నియో గలవు కొన్నిటిగూర్చి తెల్పుచుంటి నండి॥ ॥ఇం॥

1. "మీనంబాకం" అను స్థలమందున విమాన మెక్కండి
"హైదరాబాద్", "దక్కన్" దాటి "బొంబాయ్" చేరండి
"కరాచి" దాటిన "బాగ్దాడ్" నగరం కానగలరు మీరు
"పాలస్టీను", "సూయజ్" కాలువ పరగు పరగునాను
"కెయిరో" దాటి "అలెగ్జాండ్రియా" చేరగలరు మీరు
మెడిటరేనియన్ సీ మీదుగనే "ఏథెన్సు" కు పోయి
"పారిస్ నగరము దాటిన తోడనె క్రాయిడన్" చేరెదరు
క్రాయిడన్ అనునది "లండన్" లోపలి యేరోడ్రోమండి॥ ॥ఇం॥

**2.** కరాచి దాటిన "ఢిల్లీ" పట్నం కాంచగలరు మీరు
కలకత్తా, రంగూను దాటి "బాంకాకు" ను చేరి
అచ్చటనుండి "సింగపూరు" కే నేరుగ చేరెదరు

సింగపూరులో విమానమెక్కి "బటేవియా" దాటి
"డార్విన్" నగరపు యేరోడ్రోముకు దాపున చేరెదరు॥ ॥౩౦॥

షరా:—ఈపాట 5 వ తరగతికి నూతనభూగోళ సిలబసు ననుసరించి తయారు చేయబడినది.

---

# పల్లెటూరి చదువు

(సంపాదకుఁడు)

ఒక చిన్న నాటిక:—

ప్రదేశము—ఒకయిల్లు

(పంతులు వచ్చి యింటిముంగల నిలుచును)

పంతు:—కనకమ్మా! తొందరగా బడికిరా, వేళయింది.

కన:—(పిల్ల నెత్తుకొని బయటికివచ్చి) పంతులుగారూ! ఇవ్వాళ నేను రానండీ!

పంతు:—ఎందుకని?

కన:—మా అమ్మ వద్దన్నదండీ! పిల్లను ఎత్తుకోవాలంట

పంతు:—ఏదీ మీఅమ్మను పిలు?

కన:—(బిగ్గరగా) అమ్మా! పంతులుగారు పిలుస్తున్నారే!

(వీరమ్మ బయటికి వచ్చును)

పంతు:—వీరమ్మా! అమ్మాయిని బడికి వద్దన్నావు ఎందుకు?

వీర:—మాకు చదువెందుకండీ! ఉద్యోగాలు చేస్తామా? ఉపన్యాసాలిస్తామా? చేతి కక్కరకు వచ్చిన పదేళ్ళపిల్లను మూపూటలు మేపి ఒళ్లో కూర్చుండబెట్టితే సంసారమెట్లా సాగుతుంది? పనిపాటలు చెయ్యకున్నా ఏదో కాస్తపిల్లనైనా సమదాయించవద్దు. మీకేం మారాజులు. ఇంట్లోకూర్చున్నా అన్నీ జరిగి పోతవి.

పంతు:—మా మహారాజుతనం ఏడ్చినట్లుంది. ప్రొద్దున నిద్రలేచినప్పటినుండి యీ గడపసంచారం చేయటమేగా. మా మహారాజుతనం సరేలే. మాక్షోభ నీతో చెప్పుకుంటే యేమితీరుతుంది? ఏదోకాస్త సర్దుబాటుచేసుకొనిపిల్లనుబడికిపంపు. చదువుకుంటే మంచిదేకాని చెడ్డయేమి లేదుకదా!

వీర:—ఏమిచదువండి పంతులుగారూ! ఇప్పటికి రెండేళ్ళనుంచీ మాపిల్ల బడికొస్తున్నదే? ఏమివచ్చినదండీ? ఈ రెండేళ్ళలో పలకలకని, బలపాలకనీ, పుస్తకాలకనీ దసరాలకనీ పదిహేను రూపాయలుఖర్చుపెట్టామే? ఏమిలాభమండీఈచదువు?

కన:—అమ్మా! నాలుగు రోజుల్లో పరీక్ష పంతులు వస్తారట! కొత్తచొక్కా కొత్త పరికిణీ తొడుక్కొని రమ్మన్నారే పంతులుగారు. అమ్మా! నాకు కుట్టించవే!

వీర:—ఇప్పటికి కుట్టించినవి చాల్లే. ఈకరువులో గుడ్డలు కొనాల్సిందే ? ఈపాడు చదువుకంటే ఆ యేకులన్నా వడకటం నేర్చుకోరాదూ ?

పంతు:—ఆ పని బళ్లో నేర్పుతారు వీరమ్మా ? ఇప్పటి చదువులు పూర్వకాలపు చదువులుకాదు. అన్ని పనులూ బళ్లోనే నేర్పుతారు. కనకమ్మా ! పూస లల్లకం నీకు చేతనవునుకాదూ ?

(ఇంతలో ఆయూరి పెద్ద ఆత్రోపనే వచ్చును)

పెద్ద:—(పంతులును చూచి) ఏమండోయి పంతులుగారు ? ఇంకా బడికి పోలేదేం ? మాశ్రద్ధగానే పిలుస్తున్నారే పిల్లల్ని ?

పంతు:—సరేకాని సుబ్బారెడ్డీ ! మీా పిల్లవాణ్ణి పంపటం మానేశావు ?

సుబ్బా:—మానెయ్యక యెందుకండీ యీా చదువు ? ఐదేళ్ళు పంపానే ? మావాడి కేమి వచ్చిందండీ? నా చిన్నతనంలో కామయ్య పంతులుగారు చెప్పేరు. చదువంటే అదికాని మీారు చెప్పేది చదువు కాదండీ !

పంతు:—అదేమిటిరెడ్డీ ! అలాగంటావు. మేము చెప్పేది చదువుకాకపోతే మరేమి టంటావు ?

సుబ్బా:—బతకలేక బడిపంతులంటారు. అయిదేళ్ళు చదివినా మావాడు వుత్తరం రాయలేడు. ఏదన్నా కాగితం వస్తే చదవలేడు. నోటి పద్దుచూచి లెక్క పెట్టరా అంటే చేతకాదంటాడు. ఏదన్నా భాగోతమో రామాయణమో చదవరా అంటే నడవదంటాడు. ఎందుకండీ యీా చదువు ? కూటికా ? గుడ్డకా ? ఈ అయిదేళ్ళు అరకపని నేర్పివుంటే జీతగాడిఖర్చు తప్పేది ?

వీర:—అదేలన్నా! నేనూ చెప్పుతున్నాను. చేతకక్కఅకొచ్చిన పిల్లను బడికిపంపమంటే యెట్లాపంపటం? (లోపలికి వెళ్ళును)

పంతు—రెడ్డీ ! ఇంతచదువుకున్న వాడివి నీవుకూడ మాట్లాడితే బడికి పిల్లల్ని మరె వ్వరు పంపుతారు ? ఊరిపెద్దవు నోరుచేసుకోకపోతే బడిసాగుతుందా ?

సుబ్బా:—అవునండీ ! ఏమన్నావస్తుంటే యెందుకు పంపను? అయిదారేళ్ళు చదివినా పుస్తకంచదవడం చేతగాకపోతే ఆచదు వెందుకండీ? నేను చదివేటప్పుడు నాలు గేళ్ళలో ప్రేమరీ పరీక్షయిచ్చాను. వడ్డీలెక్కలు, పుట్లలెక్కలు, యెరుసులు, కొలతలెక్కలు, అన్నీ చెప్పారు. భాగోతము, రామాయణం, అమరం, ఇంకా మరేమిటో చెప్పారు. ఇప్పటికీ ఆపద్దేలన్నీ వచ్చు. ఇప్పుడివేమన్నా మీాబళ్లో చెప్పుతున్నారండీ? అసలు మీాపంతుళ్ళ కివన్నీవోస్తేకాదూ? మొన్న కొత్తగావచ్చిన ఆ రామారావుగారంట! వూళ్ళో పెత్తనాలు సాగించాడంటనే? ఆయనకు చెప్పు మర్యాదగావుండమనీ. సరేకాని, ఆనోటుబాపతు యేమన్నా యిప్పిస్తారా ?

పంతు:—కరువులో అధికమాసం. ఇంతవరకు గ్రాంటు చెక్కులురాక తిండికే చస్తుంటే బాకీలు తీర్చమా ? నాలుగురోజుల్లో పరీక్ష పంతులు వస్తాడట; ఆయునకు

మేనా పంపాలి. ఉన్నరోజులు కాస్తఅనువుగా పెట్టి పంపాలి. ఏవో బట్టలు కందులు కావాలన్నాడు. ఆఖర్చుకూడ సుట్టజెప్పుకోవలెనో యేమ్మో! మా కష్టాలు అడుగుతావు రెడ్డీ! ఇట్టి పిల్లల్ని పంపకుంటే మీరందరీలాగ తూర్పార పట్టడం. పిల్లలు రాకుంటే-చివరకు ఒక్కడు తక్కువైనా సరే-ఆయన సొమ్ము ఖర్చు అయినట్లు మాకిచ్చే కాస్తగ్రాంటులో తగ్గించటం ఇవిలేకుండా సర్దుబాటు చేసుకోటానికి యీామ్రొక్కుబళ్ళు చెల్లించుకోవడం. అడుగుతావు బాబూ మా బ్రతుకు? ఎంతమందికి వంగి వంగి సలాములుచేసినా యీపొట్టకక్కుర్తి తీరటంలేదు. మాకు మంచిరోజులున్నవో, లేవోమరి

సుబ్బా:—కష్టాల కేంలెండి చాల పొద్దెక్కింది. ఏదో యిల్లిల్లు తిరిగి పిల్లల్ని పోగు చెయ్యండి. మాకు చదువొచ్చినా రాకున్నా మీ గ్రాంటు మీకు చెల్లిస్తారు గదా? ఇంతకూ అన్నివిధాల అణగారిపొయ్యేది రైతుగాని మీకేమయ్యా దొరలు. చిత్తంబాబూ! పదండి! (బిగ్గరగా) వీరమ్మా! ఏదో పరీక్షపంతులు వస్తాడంట. ఈ నాలుగురోజులు పంపిచ్చు. మళ్ళీ పరీక్షదాక మనం పంపేది లేదు. ఆయనవచ్చి అడిగేదిలేదు.

(నిష్క్రమించును.)

పంతు:—ఆహా! చివరకు పల్లెటూరి పంతులుగతి యెంతవఱకు వచ్చినది! రామరామ! ఈ నీచపుబ్రతుకు పగవానికైనా వద్దు.

(వెడలిపోవును.)

---

# ఆంధ్రవాఙ్మయము

(గతసంచిక తరువాయి)

కె. ఎ. స్వామి

నాచనసోమనాథుడు:—నవీన కవితా సనాథుడగు సోమనాథుడు ఉత్తర హరి వంశమును రచించెను. ఈతడు భారతకవుల కెనయగు కవిశేఖరుడు. కల్పనాకౌశల మున ప్రతిభగలవాడు. కవిత్వము ప్రౌఢ మైనను రసవత్తరమైనది. "ఈతని హరి వంశమునందలి సామెతలు భారతభాగము లందు గల సామెతలను మించును" అని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వెల్లడించి యున్నారు. ఈతడు తిక్కనాదులకు పూర్వుడని కొందరు తలచుచున్నారు. ఈతని కవితయందు ప్రాబంధిక బీజములు మెండు.

రామాయణము, భాస్కరుడు:-ఆంధ్ర మున రామాయణము లనేకములు గాన బడుచున్నవి. కాని వానిలో ముఖ్యమై నది భాస్కరరామాయణము. ఇందు భాస్కరునిచే రచింపబడినది కొలదిగా

నన్నను అతని శిష్యులు మిగిలినది రచించి గురుభక్తికొలది దానికి భాస్కరరామాయణ మను నామమిడినట్లు మనకు తెలియుచున్నది. దీనికృతికర్తలలో భాస్కరుడు శిరోభూషణము శ్రీమదష్టభాషాకవిమిత్ర మల్లికార్జునభట్టు కొంతభాగమును రచించెను. అయోధ్యాకాండను సకలకలావిశారదుడగు రుద్రదేవుడుగావించెను. ఇందు సంస్కృతపద గుంభనమధికము.

రంగనాథుడు రచించిన రామాయణము రంగనాథ రామాయణము. రంగనాథుడు ద్విపద వాఙ్మయమును అవలంబించి ప్రజానీకమును తేటతెలుగు మాటల కవితనల్లి రంజింపజేసినాడు. ఈతని ద్విపద రామాయణమే మన ద్విపదకావ్యములకు మొదటిదిగా నెన్నదగ్గది.

శ్రీనాథుడు:- "శ్రీనాథకవి రాజాంధ్రలోకమునందత్యంత ప్రసిద్ధివడసిన పండితుడు; సుకవి. శైశవమునుండియు మిగుల మేధాసంపన్నుడు; విద్యాభిలాషకలవాడు" అని యీతని కేంద్రీకరించి చూపగలము. ఈ కవిసార్వభౌముడు చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాటి నుండియు కవితచెప్పుట కుపక్రమించినాడు. చూడుడు!

సీ॥ "చిన్నారి పొన్నారి చిఱుతకూకటినాడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతినొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్షనైషధ కావ్య మాంధ్రభాష
ప్రౌఢ నిర్భరవయఃపరిపాకమునగొని
యాడితి భీమనాయకుని మహిమ
బ్రాయమింతయు మిగుల గైవ్రాలకుండ
గాశికాఖండమను మహాగ్రంథమేను
దెనుగు జేసెద గర్ణాట దేశకటక
పద్మవనహేళి శ్రీనాథ భట్టసుకవి."

శ్రీనాథు డీపద్యమును కాశీఖండ రచనాకాలమున చెప్పుకొనియెను. గౌడడిండిమ భట్టుయొక్క విజయడిండిమమును కంచుఢక్కను బగులగొట్టి సకలవిద్యాసనాథుడగు నీకవి రాజాస్థానమున కనకాభిషేకమును గావించుకొని కవి సార్వభౌముడను ప్రతిష్ఠానామమును బొందెను. "కాశీఖండ మయః పిండం నైషధం విద్వదౌషధమ్" అని కొనియాడబడు గ్రంథముల కొనర్చిన యాంధ్రీకరణమే యీతని పాండితీగరిమను వెల్లడించుచున్నవి. ప్రబంధపరమేశ్వరునిచే నిర్మింపబడిన శైలి నీతడు సొంపుగా నభివృద్ధిపరచెను. ఈతని కావ్యములలో "మరుత్తరాట్ చరిత్ర, శాలివాహన సప్తశతి" మనకిపుడులభింపలేదు. ఈతనికావ్యములలో హరవిలాసము, నైషధము, భీమఖండము, కాశీఖండము, శివరాత్రి మాహాత్మ్యము ముఖ్యములు. శ్రీనాథుడు వీధినాటకమును, పల్నాటి వీరచరిత్రమును కూడ రచించెను. ఐహికవాంఛాలాలసుడై తన కావ్యపరంపరలను రాజులకు కృతినిచ్చెను. అవసాన దశయందు నిరుపేదతనము ననుభవించినట్లీతని కొన్ని పద్యములవలన మనకు తెలియవచ్చుచున్నది.

సీ॥ కవిరాజు కంఠంబుఁ గౌగిలించెనుగదా
పురవీధినెదురెండ పొగడదండ
సార్వభౌముని భుజాస్తంభమెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రి యుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేతి పోసపోతి
సెట్లు చెల్లింతు టంకంబు లేదునాడు."

సీ॥ కాశికావిశ్వేశు గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁడిచ్చు
గైలాసగిరిఁబండె మైలారువిభుఁడేగి
దినవెచ్చమేరాజు దీర్పఁగలఁడు
రంభఁగూడెఁ దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరికేరాజు ప్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱిహేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁగలుగు
భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
గలియుగంబున నికనుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి ”

భాగవతము:- పోతన.- వ్యాస కృత మయిన శ్రీమద్భాగవతపురాణమును దెనిఁగించిన కవి. ఒక మహా తపఃఫలసంజాతమైన కవితాకన్యను క్రూరకర్ణాట కిరాట కీచకులకు కృతినిచ్చి వారిచ్చుపడుపుకూడు భుజించుటకంటె సుకవి హాలికుఁడైనను, కందమూల కౌద్దాలికుఁడైనను, మంచిదియే అని వక్కాణించినాఁడు. పోతనగారి కవితా శైలి ద్రాక్షాపాకము. మృదుమధురము. ఈతఁడాంధ్రగీర్వాణ భాషల రెంటికిని సమాన గౌరవమిచ్చెను. ఈతని కవనమున శబ్దాలంకారములు మెండు. మూలము నందలి సరసంబులుగాని కథాంశములను సైతము రసవత్తరముగా విరచించు నేర్పు గలవాఁడు పోతన. “పలికెడిది భాగవత మట పలికించెడివాఁడు రామభద్రుండట” యని యీతఁడు రామభద్రునాజ్ఞచే భాగవతమును రచించినట్లు చెప్పుకొనియెను. మూలమునందలి రసౌచిత్యము చెడకుండ నూతనాంశముల నందిమిడ్చి చక్కనిశైలిని పాఠకులమనము లాహ్లాద వికాసములందునట్లు రచించినాఁడు భాగవతము కారణాంతరములచే కొంతభాగము శిథిలముకాఁగా దానిని సింగనాదులు పూరించిరి. “భోగినీ దండకము, వీరభద్రవిజయము, నారాయణ శతకము” అను గ్రంథములు కూడ నీతవి కృతములే. ఈతని భాగవతము చదువునపుడందు పాఠకులు లగ్నముగాక తప్పరు.

సీ॥ పాలుబోతునకైన బౌరుషంబొదవు నీ
సంగ్రామవర్ణనల్ జదువుచున్న
రహీనపుంసకుఁడైన రమణులఁగోరు నీ
శృంగారవర్ణనల్ జేరివిన్న
గటికివానికినైన గఱఁగు జిత్తంబు నీ
కరుణారసార్ద్ర సత్కథలఁగన్న
నజ్ఞానియైన దివ్యజ్ఞానరాశియై
పొదలుయుష్మద్భక్తి బోధనెన్న
క్షితిధవదిరచిత భాగవతపురాణ
రత్నమునకెద్దిసాటి పురాణకోటి?
మాన్యచారిత్ర! కేసనమంత్రిపుత్ర!
సద్యశస్సాంద్ర! పోతరాట్సత్కవీంద్ర!
తు॥ సీ॥ చాదరి.

చూచితిరా పోతనకవితయందలి రసౌచిత్యము. “పోతన మహాకవి”

ఈ యుగమున స్వతంత్రకవి వీరభద్రుఁడు “వాణీనారాణి” యని నుడివిన మహాకవి. జైమినీభారతము, శకుంతలాపరిణయము మొదలుగాఁ గల గ్రంథముల నీతఁడు రచించెను. ఈయుగమున అనేక కవులు వెలసిరి. నీతిసారమును రచించిన ప్రతాపరుద్రుఁడు కుమారసంభవమును తెనిఁగించిన నన్నెచోడుఁడు, బసవపురాణకర్త సోమనాథుఁడు దశకుమార చరిత్ర వ్రాసిన కేతన, నీతిశాస్త్రముక్తావళిని వ్రాసిన పెద్దన, మార్కండేయ పురాణమును రచించిన మారన, కవిజనాశ్రయము, రాఘవ పాండవీయము రచించిన వేములవాడ భీమకవి, విక్రమార్క చరిత్ర వ్రాసిన అనంతామాత్యుఁడు, హరిశ్చంద్ర ద్విపద వ్రాసిన గౌరన, మొదలగు కవులు వెలసిరి.

(సశేషము.)

# నేనెవరో గ్రహించండి



రచయిత, పసుపులేటి రామకోటయ్య

నేను దేవుని సృష్టితోనే పుట్టాను సృష్టితోనే పెరుగుచున్నాను. నేను విశ్వామిత్రునివలె సృష్టికి ప్రతిసృష్టి చేస్తున్నానని గర్వంగా చెప్పగలుగుచున్నాను నేను పేరుపొందినట్లు, కీర్తినిగడించినట్లు యెవరుపొందలేదు నేను మానవులనందరిని ముగ్ధులయ్యేటట్లు చేసున్నాను ఒక్కొక్కసారి నాకంటే సృష్టికర్త వేరే లేడంటూ వాదించేటట్లు ప్రజానీకాన్ని పరవశులుగా జేస్తున్నాను నా శక్తి సామర్థ్యముచేత ఒకసారి నేను నాకే గర్వించుతాను ఇంకొకసారి నాకై నేనే చింతిస్తాను స్వేచ్ఛలేక జనుల చేతుల్లోఁజిక్కి బానిసనైనానని మరొకసారి నాకీర్తిని నాగొప్పదనకిని చూచుకొని నాకంటే వేరే గొప్పవాడు లేడని ధైర్యముఁదెచ్చుకుంటాను గర్విస్తానుకూడ సృష్టిజాలమంతయు నాచేతిలోని ఇంద్రజాలమేనని నాలో నేనే మెచ్చుకుంటాను.

నాపుట్టుకను గురించి నాచిన్నతనములో మాయమ్మ నాతో చెప్పిన రహస్యము నేను అసలే మరచిపోయ్యాను కాని నాకు యిప్పుడిప్పుడే జ్ఞాపకం వస్తూంది. మాయమ్మ చెప్పుతూంటే వింటూయుండేవాణ్ణి మీకు చెప్పాలని కోరిక కలిగింది నేను నాకంటె గొప్పవాడైన భగవంతునిచేత ప్రసాదించబడ్డానని నాకు ముగ్గురు అన్నదమ్ములున్నారనికూడ జ్ఞప్తికివస్తూయున్నది మానలుగురను ప్రసాదించిన మాయమ్మకు మూడుమూర్తులుగా కనిపించాడట మూడుముఖాలతో నేనే సృష్టికర్తనని నామువ్వురు సోదరులు యిప్పుడెచ్చటయున్నారో నాకే గోచరించుటలేదు. కాని నేను కొన్నాళ్లకు విచారించి నాలో నేనే వితర్కించుకొని జ్ఞాపకమునకుఁదెచ్చుకోఁగలనను ధైర్యము నాకున్నది చెప్పొద్దూ నన్ను మాయమ్మ మిక్కిలి ప్రేమతోను, గారాబముతోను, వెలుపలికి పోకుండా పెంచింది నేను చాల అందంగలవాడననియు, తెలివితేటలు గలవాడననియు, తలంచిరి. నేనొక రోజున పొరఁబాటున యింటిముందరి ఆటసలముగా నుపయోగించబడుతున్న ఒక యిసుక ప్రదేశమందు ఒంటరిగా నాడుకొనుచుండగా మాయమ్మ యింటిలోనున్న సమయములో నన్ను కొందరు చోరులు అకస్మాత్తుగా దొంగిలించి కెళ్లారు. నాఅందచందాలను తెలివితేటలను తిలకించి గమనించి, వారు నన్ను పెంచుకోవాలనిఅనుకున్నారేమో మాయమ్మయున్న దేశములోనుండి చాలదూరము రైలుమీదచిన్నపడవలమీద వారున్నన్ను తీసికొనివెళ్లి పెంచారు ప్రేమతోను శ్రద్ధతోను భక్తితోను నాదేశము విడి కొంపోవుటచేత నన్ను వారి దేశమునకు పరిసర దేశస్థులు దొంగిలించుకొని వెళ్ళెదరను భీతిచేత చిలుకను పంజరములో పెంచినట్లు నాలుగుగోడల మధ్యనున్న కటకటాలలో బంధించారు నన్ను యెవరైన గుర్తుపట్టుతారేమోదని నన్ను పెంచినవారు నన్ను అంతఃపురములోఁనుంచినను నాకు కావలసిన నన్నిటిని కొదువలేకుండగ నిత్యూ పెంచి పెద్దవానిగా జేసారు. నేను గొప్పవంశమునకు చెందినవాడనగుటచేత మసిపాతకుఁగట్టిన మాణిక్యము కాంతి మరుగుపడనట్లు నా సుకృతము వలన నా జన్మభూమి మహిమాతిశయము వలనను, నేను నేర్చిన విద్య యావత్తు నన్ను పెంచినవారు పరాయివారైనప్పటికిని భేదమేమాత్రమును లేక వారికే నేర్పెను. వారి ద్వారా వారి దేశస్థులకు - అనగా నేనిప్పుడు నివసిస్తూయున్న దేశమంతటికి - నా విద్యా ప్రభావాన్ని నిష్కపటంగా నేర్పాను కొన్నాళ్లకు నేనున్న దేశములోని కొందరి సాయముచేత నావిద్య కొంతమాత్రమే యితరదేశములకు ప్రాకింది. కాని నాకున్న విద్యాకౌశలాన్ని నేనున్న దేశములో వెదజల్లుటచేత నా దేశపు సరిహద్దులను దాటి వెళ్లలేదు నావిద్యను పొందిన విద్యావంతులు, పండితులు, కవులు, శాస్త్రవేత్తలు, రహస్యముగా కొన్నిటిని - నామహిమాతిశయము చేత క్రొత్త క్రొత్తవాటిని - గ్రహించి పరిశోధించగలిగారు. వారు కనిపెట్టిన పరిశోధనలచేత ప్రపంచమంతటిని గజగజ లాడించుచున్నారు. ప్రపంచములోని వారందరును నేనున్న దేశములోని వారికి మించినవారు లేరనేటట్లుగా నేను వారిని తయారుచేశాను. నేనున్న దేశము ప్రపంచములోని దేశము లన్నిటిలోని చిన్నదేశమే యైనప్పటికిని పరిశోధనాలయములతోను, యంత్రశాలలతోను,

పుస్తకభాండాగారములతోను వారి దేశమంతటా నింపాను. వారి కీర్తి నలుదిశలయందును వ్యాపించే టట్లుగా చేశాను

నాలో యున్న గొప్పవిషయాలను, నేను చేసిన చిత్రమైన పనులను, నేను చేస్తూయున్న తమాషాలను, నేనే మీకు చెప్పుకోవాలని తలంచాను, నేను తయారుచేసిన వస్తువులను ఒక్కొక్కటిగా వివరిస్తాను వినండి నేను మొదట్లో చిన్న సైకిళ్లను మోటారు కార్లను, మోటారు సైకిళ్లను, రైలు యింజన్లను, ఫ్యాక్టరీ యింజనులు మొదలైనవాటిని కనుగొని తయారుచేసి నాదేశమంతటనువ్యాపింపజేశాను, మెల్లగా వాటినే యితరదేశములకు కూడా వ్యాపారనిమిత్తం పంపి వారికి సౌకర్యాలను యేర్పరిచాను తర్వాత కొన్నాళ్లకు నీటిమీద ప్రయాణము చేయుటకు పెద్దపెద్ద యోడలను తయారుచేసాను భూమిమీదనే సుదహరించిన సైకిళ్లు, మోటార్లు, రైళ్లుమొదలైనవి యేర్పరిచాను ఆకాశపథములో ప్రయాణము చేయుటకు విమానాలను వివిధరకములుగా తయారుచేసాను ప్రథమంలో ఒక వూరినుండి యొకవూరికి మాటలను వినిపించాను టెలిగ్రాము, టెలిఫోనుల ద్వారా సముద్రము అడ్డగించునను భయము యేమాత్రము లేక నీటిమీదకూడ తీగలను స్థాపించి దూరదేశములకుకూడా వార్తలను నడిపించాను కొంత కాలానికి నా ప్రజ్ఞను ప్రపంచమంతా చాటించేదుకు ఒక దేశమునుండి మరియొకదేశమునకు ప్రపంచమంతటను తీగెలు లేకుండా వార్తలను, సంగీతాన్ని వినేటట్లుగా రేడియో యను విచిత్రమైన యంత్రాన్ని కనిపెట్టి ప్రపంచమంతా ఆశ్చర్యపడేటట్లు చేశాను ప్రథమంలో మనుష్యులను, జంతువులను, ఫోటోతీసి వారలు కదలుచున్నట్లుగా చలనచిత్రయంత్రముద్వారా చూపించగలిగాను తర్వాత మనుష్యుల యొక్క, జంతువులయొక్క మాటలను, ధ్వనులను, గ్రామఫోనుప్లేట్లలో వినిపించి తర్వాత చలనచిత్ర యంత్రమునకు కలిపి యెప్పుడో ప్రదర్శించిన నటకుల ప్రదర్శనములను, పలుకులను, సినిమాశాలలో వినిపించి ప్రత్యక్షముగా వారే పదర్శించినట్లుగా కనులు మిఱుమిట్లు గొలునట్లు చేశాను. ఈమధ్య రేడియోమాదిరిగా ఒకచోట జరుగుచున్న దృశ్యాన్ని మరియొకచోటనుండి చూచి ఆనందించేందుకు టెలివిజన్ అను బహువిచిత్రమైన యంత్రాన్ని కనిపెట్టగలిగాను. ప్రపంచములో కొన్నిచోట్ల యీయంత్రాన్ని వ్యాపింపజేశాను. ఇంతలో జరుగుతూన్న నాటకమనను సుడిగాలి దుమారములతో సద్దుతగినట్లు నేనుపయోగించుతూన్న నాయుపాయానికి భంగము వాటిల్లినది నామనోనిశ్చలత్వము చెడగొట్టింది యీయుద్ధమనే పెనుగాలి పశ్చిమఖండములో చెలరేగి తూర్పుదేశములకు కూడ సెగబ్రాకి చివరికి ప్రపంచమంతా ముట్టుకుంది యీయుద్ధజ్వాల.

ఈ యుద్ధజ్వాలనుండి తప్పించుకొనుటకు సైన్యసమేతంగా శత్రుముఖాన్ని యెదిరించుటకు పన్నాగాలను పన్నియుద్ధానికి పనికివచ్చే ఫిరంగులు తుపాకులేగాక, కొత్తనాటినికూడా కనిపెట్టాను. ఆకాశమునుండి విమానాలద్వారా బాంబులను వేయడం శత్రువుల బాంబులనుండి తప్పించుకొనటకై మరల బాంబులను వేయుటకుగాను మరఫిరంగులనుకూడ తయారుచేశాను ఇంకా రకరకములైన మారణయంత్రాలు టాంకులు - భూమిమీదయున్నా, నీటిలోపల ప్రయాణముచేసి యోడలను ముంచే జలాంతర్గాములను, టార్పెడోలను, వివిధరకములైన బాంబులను, చివరకి ప్రపంచమందున్న ప్రతిజీవియు నశించుటకై విషవాయు ప్రయోగాలను, కనిపెట్టి ప్రస్తుత ప్రపంచ యుద్ధమందు అమలు పరిచాను, వీటిద్వారా దేశదేశములలోని తగవులను దీర్చుతున్నాను తగవులను పెంచుతున్నాను కాని నా అసలు వుద్దేశ్యమేమనగా నాకున్న విద్యా ప్రభావాన్ని నేను వృద్ధి పఱచుకొని నేనున్న దేశపువారికి నేర్పి ప్రపంచమంత ఆశ్చర్యమున పురిగొల్పి సృష్టిని సహోమరిపించే పనులనుచేసి క్రొత్తివాటిని కనిపెట్టాలని అయితే ఇప్పుడు ప్రారంభింపబడిన యుద్ధము నాపుటకై వివిధ ప్రయత్నాలతో వివిధవస్తులను మంచివాటిని చెడ్డవాటినిగూడా కనిపెట్టి తయారుచేస్తూయున్నాను ఇది కలియుగము కావున యిలాంటి పరికరాలతో యుద్ధాన్ని నడిపించాలని నాకు ఆశకలిగింది

నాజన్మభూమి నేను ప్రస్తుతం నివసిస్తున్న దేశముకాదని మొన్న మొన్న నే కనుకొన్నాను, వీనులార విన్నాను; కొందఱి మహాత్ములవలన - పెద్దల వలన - యోగీశ్వరులవలన నా జన్మభూమియందున్నప్పుడు నాకీ చపలస్వభావములు లేవు, చిలిపి చేష్టలును లేవు. నాజన్మభూమియందున్నప్పుడూ, అది పవిత్రభూమి యగుటచేత నేనెల్లప్పుడును మంత్రములతోను, జపతపహోమాది క్రియలతోను, మానవులను సన్మార్గులనుగా జేయుటకు ప్రయత్నించేవాణ్ణి, కాని

R S

1941 సం॥ భూగోళశాస్త్ర ప్రణాళిక ననుసరించి
రెండవ తరగతి విద్యార్థులకు బోధించుటకు కావలసిన

# బొమ్మల పటములు

1. ఇతరదేశము లందలి బిడ్డలు Children in other lands — ఎస్కిమోబిడ్డలు
2. ,, ,, — సహారాయందలి బిడ్డలు
3. ,, ,, — ఎఱ్ఱయిండియనులు
4. ,, ,, — నీగ్రోబిడ్డలు

పైని చెప్పబడిన బిడ్డలనుగూర్చి విద్యార్థులకు బోధించుటకు కావలసిన 48 బొమ్మలు అతి దళసరి ఆర్టుపేపరుపై కాగితమునకు నాలుగు చొప్పున ముద్దులొలుకు నట్లు రంగులలో ముద్రింపబడినవి. ఆ జాతుల బాలబాలికలు అనుదినము చేసెడి పనులు, నివసించెడి గృహములు, ధరించెడి దుస్తులు, వాడెడిపనిముట్లు, ఆడెడిఆటలు మున్నగు అనేక విషయములు ఈ బొమ్మలలో జూపడమైనది.

సిలబసులో విధించబడిన ప్రకారము ఉపాధ్యాయుడు కథలను బోధించునపుడు ఈబొమ్మలను విద్యార్థులకు చూపినచో వారి కాయా బాలబాలికలు కండ్లకు కట్టినట్లగుపడుదురు. పిదప, కథకు సంబంధించిన చేతిపని నేర్పుటకు, బొమ్మలు చేయుటకు ఇసుకతో బల్లపై దృశ్యములు జూపుటకును, మాదిరి చిత్తరువులు వ్రాయుటకును, పిల్లలచే నాటకములాడించుటకును ఈ బొమ్మలు ఉపాధ్యాయునికి తోడ్పడు విధము ఇంతంతయని చెప్పనలవికాదు. ఒక్కొక్క పటమునందు బోధింపవలసిన విషయములు ఉపాధ్యాయుని కొఱకు ప్రత్యేకముగ ముద్రింపబడినవి. పటములు కొను వారికివి ఉచితముగ ఈయబడును.

48 బొమ్మలుగల 12 కాగితములు (In an envelope) వెల రూ 2-0-0
గుడ్డ, కొయ్యకఱ్ఱలపై అమర్చబడినవి 3-0-0

దొరకువారు:—ఆంధ్రాబుక్ డిపో మ్యునిసిపల్ హైస్కూలు రోడ్

విజయనగరం.

For E. S. L. C.—Historical Atlas in Telugu with notes Rs 0—12—0
Map of India in Telugu 0— 3—0
Map of the Western Hemisphere 0— 3—0

సోల్ ఏజంట్లు:— రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు; బ్రాంచీలు:—రాజమండ్రి — గుంటూరు.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K వెంకట్రావు B A, L T, గారిచే

2 - 3 - 4 - 5 - 6 - 7 - 8 తరగతులకు

వలయువారు:— రామా అండ్ కో.,

ఏలూరు - మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.